# రెండు మాటలు

ప్రజా స్వామికవాదిగా పరిపాలనాయంత్ర నిర్వహణ పరిశీలన చేయడం ఫలితంగా కలిగిన ఆలోచనలే ఈ చిన్నపుస్తకం.

ఆంధ్రరాష్ట్ర నిర్మాణ సందర్భంలోనూ, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం నియమించినపొదుపు సంఘం సందర్భంలోనూ, రివిన్యూబోర్డు రద్దును గురించి యోచించినపుడూ ఈ నాడు ప్రభుత్వం నియమించిన పరిపాలనా సంస్కరణల సంఘం సందర్భంలోను, నాలో కలిగిన అభిప్రాయాలను ఈ చిన్న పుస్తకరూపంలో అందజేస్తున్నా.

ప్రజలు పరిపాలనలో సన్నిహిత సంబంధం కలిగించుకోవలసిన ఈ రోజులలో ఇది కొంత ఆలోచనకు అవకాశం కలిగిస్తే నా కృషి ఫలించినట్లే.

ఈ గ్రంథ ముద్రణ నిర్వహించిన మిత్రులు, శాసనసభ్యులు శ్రీ చింతలపాటి సీతారామచంద్ర వరప్రసాద మూర్తిరాజుగారికీ, అమరావతీ ముద్రణాలయం వారికి నా ధన్యవాదాలు.

సత్తెనపల్లి
15-9-60

భవదీయుడు
వావిలాల గోపాలకృష్ణయ్య.

# ప్రజాస్వామ్య వికేంద్రీకరణ విజయానికి
# పరిపాలనా సంస్కరణల ఆవశ్యకత

ప్రజా ప్రతినిధుల ఆధిపత్యం క్రింద సమర్థవంతమైన పరిపాలన జరగటమే ప్రజాస్వామ్య విధానపు ముఖ్యాశయం.

అభివృద్ధి, సంపదల దృష్ట్యా ఒక ప్రామాణిక దశను చేరి, సుస్థిరమైన వ్యవస్థను కలిగి ఉన్న సమాజానికి ఈ పద్ధతి చాలా అనువైనది. కాని, జీవన ప్రమాణం దృష్ట్యా మన దేశం ఇతర దేశాలకన్నా చాలా వెనుకబడి ఉన్నది. స్వాతంత్ర్య సాధనానంతరం దేశంలో అనేక నూతన సమస్యలు ఉదయించినవి. వెనుకబడిన దేశాల పరిపాలనా వ్యవస్థ, వాటి ప్రమాణాలు, అక్కడి విధానాలపై ఐక్యరాజ్యసమితి, ఉప సంఘం 1951 లో సమర్పించిన ఒక నివేదికలో వెలిబుచ్చిన అభిప్రాయాలను పరిశీలిస్తే, నేటి మన సమస్యల స్వభావం కొంత వరకు అవగాహన అవుతుంది. భూస్వామిక, సాంప్రదాయబద్ధమైన వ్యవస్థ నుంచి బాధ్యతాయుతమైన హేతుబద్ధమైన పరిపాలనా వ్యవస్థకు; వ్యవసాయక ఆర్థిక వ్యవస్థ నుంచి పారిశ్రామిక వాణిజ్య వ్యవస్థకు పరిణామం జరగటానికి సంబంధించిన సమస్యలే, వెనుకబడిన దేశాల పరిపాలనా వ్యవహారాలకు చెందిన ముఖ్య సమస్యలని పై నివేదికలో వారు తమ అభిప్రాయాన్ని వ్యక్తం చేసారు. ఈ పరిణామాన్ని సాధించటానికి గల వివిధ మార్గాలలో సోషలిస్టు సమాజ స్థాపనకు ఉపకరించే ప్రణాళికా బద్ధమైన విధానాన్ని మన దేశం ఎంచుకొన్నది.

వివిధ రంగాలలోని కృషిని వివేకవంతంగా సమన్వయంచేయటం వివిధ సమస్యలకుగల ప్రాముఖ్యతలను నిర్ణయించటమే ప్రణాళికా బద్ధమైన విధానపు ఆశయం. మన ప్రణాళికలను అమలు జరిపేందుకు ప్రజాస్వామిక వికేంద్రీకరణాన్ని సాధనంగా మనం ఎంచుకున్నాము. ఈ మార్పులు కార్యరూపం ధరించేందుకు జాతీయాదర్శాలపట్ల నూత్న దృక్పథాన్ని కలిగి పరిపాలనా వ్యవస్థ చాలా అవసరం. ఈ పరిపాలనా వ్యవస్థను నడిపించే వారు, తాము కూడా ఈ జాతిలో ఒక భాగమనీ, జాతీయాభివృద్ధి, శ్రేయస్సులలోనే తమ శ్రేయస్సుకూడా ఇమిడి ఉన్నదని తప్పక గుర్తించగలగాలి. మన ప్రభుత్వోద్యోగులను వర్ణిస్తూ, పూర్వ కాలపు మన సివిల్ ఉద్యోగులు, స్వేఛ్ఛా వ్యాపార యుగానికి పూర్తిగా తగినవారనీ, గతములో అంతటా భారతదేశంలోని ప్రభుత్వోద్యోగులు భూసమస్యలపైన కేంద్రీకరించటం జరిగిందనీ, భూమిశిస్తు వసూళ్ళు, శాంతిభద్రతల నిర్వహణా వారి కర్తవ్యాలుగా ఉండేవనీ శ్రీ పణిక్కర్ అన్నారు.

ప్రణాళికా బద్ధమైన విధానాన్ని మనం విశ్వసిస్తున్నాం. నేడున్న పరిస్థితులనే కొనసాగించాలని తలంపు మనకు లేదు గనకనే, జాతీయ నిర్మాణానికి తగిన విధంగా, పరిపాలనా వ్యవస్థను పునర్నిర్మించటం చాలా ముఖ్యమని తృతీయ ప్రణాళిక నిర్దేశిస్తున్నది. ఈ ఆశయం దృష్ట్యా ప్రజాస్వామిక ప్రభుత్వానికి శ్రేయోరాజ్యానికి, ప్రస్తుత పరిపాలనా వ్యవస్థ ఎంత వరకు ఉపయుక్తమైనదో తేల్చే నిమిత్తం, అది పని చేస్తున్న విధానాన్ని తిరిగి పరిశీలించవలెనని రాష్ట్ర ప్రభుత్వం నిర్ణయించటం హర్షదాయకం. ఈ సందర్భంలో ఇటీవలెనే వెలువడిన కేరళ పరిపాలన సంస్కరణల సంఘం నివేదికను గురించి ప్రస్తావించటం సమంజసం. పరిపాలనా

సంస్కరణలకు ఆధారభూతంగా ఈ క్రింది సూత్రాలను వారు రూపొందించారు.

(1) విధానాలను రూపొందించటానికి సంబంధించిన విషయాలలో అధికారాలను కేంద్రీకృతం చేసినా, పరిపాలనా వ్యవస్థలోని క్రింది దశలలో ఇతోధికంగా అధికారాలను దత్తం చేయాలని,

(2) పరిపాలనా వ్యవస్థ ప్రతి దశలోను ఎన్నుకోబడిన ప్రతినిధులకు సంబంధాలను కల్పించటం,

(3) అన్ని దశలలోను, అధికారుల కార్య కలాపాలను సమన్వయం చేయటం,

(4) వివిధ ప్రభుత్వ శాఖల సాంఘిక ప్రయోజనాన్ని, నైతిక స్థాయిని పెంపొందించటం,

(5) అధికారులకు, అనధికారులకు మధ్యగల సంబంధాన్ని క్రమబద్ధం చేయటం,

(6) నిర్మాణాత్మక కృషి నిమిత్తం, ప్రజాస్వామిక చైతన్యాన్ని సక్రమమైన పథాలకు మళ్ళించటం,

ఈ సూత్రాలు అధికార వికేంద్రీకరణ విధానానికి ముఖ్యం.

## సామాజికాభివృద్ధి బ్లాకుల ప్రతిపత్తి

తాలూకాకు బదులుగా సామాజికాభివృద్ధి బ్లాకును క్రింది దశలోని పరిపాలనావస్థకు ప్రాథమిక కేంద్రంగా పరిగణించాలి. రెవిన్యూ వ్యవహారాలన్నిటికి, బ్లాకును కేంద్రంగా ఏర్పరచవలెనని శ్రీ బల్వంత్ రాయ్ మెహతా సంఘంవారు ఉద్దేశించారు. కాని నేడు తాలూకాయే

కేంద్రంగా పరిపాలనా వ్యవస్థ నిర్మితమై ఉన్నదని మనకు తెలుసు. అభివృద్ధి కార్యక్రమాల దృష్ట్యా, ఇప్పటికే నెలకొల్పబడిన వికేంద్రీకృత వ్యవస్థ దృష్ట్యా రెవెన్యూ వ్యవహారాల లోను, ఇతర విషయాలలోను బ్లాకులే ప్రాథమిక కేంద్రంగా రూపొందించటం ఎంతో అవసరం. ఈ విధంగా, ఉద్యోగులను, తదితర ఆధారాలను లీనం చేయటంమూలంగా, బ్లాకు, తాలూకా రెండు ప్రత్యేక కార్యాలయాల నిర్వహణ తప్పి పోతుంది. ఎన్నుకోబడిన ప్రజా ప్రతినిధుల ద్వారా పరిపాలన సాగటం ప్రజాస్వామ్య ఆశయం గనక ఆ ఎన్నికలు, ప్రత్యక్ష పద్ధతిలో రహస్య ఓటింగ్ ద్వారా జరగటం అవసరం. బి. డి. ఒ. లకు కార్యనిర్వహణ విధులను అప్పగించి మిగిలిన పరిపాలనా విధులన్నీ పంచాయతీ సమితి అధ్యక్షునకే దత్తం కావాలి.

## జిల్లా స్థాయిలో పరిపాలన

ఆంధ్రప్రదేశ్ పంచాయతీ సమితి మరియు జిల్లాపరిషత్తుల చట్టం, జిల్లాపరిత్తులకు కొన్ని పరిపాలనా విధులనుమాత్రమే అప్పగించినది. కాని పరిపాలనా వ్యవహారాలన్నీ జిల్లాపరిషత్తులకే సంక్రమింపచేయాలి. జిల్లా కలెక్టర్లు పరిషత్తుల ప్రధాన కార్యనిర్వహణాధికారులుగాను, కార్యదర్శులు గాను వ్యవహరించాలి. ఇతర జిల్లా అధికారులు సహాయ కార్యదర్శులు, డిప్యూటి కార్యదర్శులుగా వ్యవహరించాలి. జిల్లాపరిషత్తులలోని స్టాండింగ్ కమిటీల మూలంగా పరిషత్తులే మరుగున పడిపోతున్నాయి గనుక, ఈ కమిటీలుకాక జిల్లాపరిషత్తు మొత్తంగా ఈ అధికారాలను అమలు జరపాలి.

అర్థిక విషయాలలో జిల్లాపరిషత్తుల అధికారాలను పెంపొందిస్తూ, ఒకేసారి మాత్రమే వ్యయం చేయవలసిన సందర్భాల్లో 2 లక్షల 50 వేల

రూపాయలు, సాలుసరిఖర్చు లక్ష రూపాయల వరకు ఖర్చుచేయగల పథకాలు నిర్వహించేందుకు అధికారం ఇవ్వాలి. జిల్లాపరిషత్తుల, పంచాయతీ సమితుల ఉద్యోగు లందనీరి, ప్రభుత్వోద్యోగులుగానే పరిగణించాలే కాని స్థానిక సంస్థల ఉద్యోగులుగా వుంచరాదు.

జిల్లా పరిపాలనా వ్యవస్థకు సంబంధించిన నిర్ణయాలలో లోపాలకు, జాప్యాలకు జిల్లా అధికారులలో చొరవలేకపోవటం, బాధ్యతా స్వీకరణకు వెనుకంజవేయడం ముఖ్యకారణాలుగా, వివిధ కమిటీలలో నాకు గల కొద్ది అనుభవంవల్ల తెలుసుకోగల్గాను. అదీగాక పై అధికారుల, సంస్థల ఆదేశాలపట్ల నిర్లక్ష్యభావం గూడా మన పరిపాలనా వ్యవస్థలో కన్పించే ఒక ప్రముఖమైన లోపం. క్రింది ఉద్యోగులపై పూర్తిగా ఆధారపడటం,ప్రజా శ్రేయస్సుపట్ల ఉన్నతాధికారుల నిర్లక్ష్యవైఖరి, జిల్లా స్థాయిలో పరిపాలనావ్యవస్థ వైఫల్యానికి ముఖ్య కారణాలు. తమ ఉత్తరువులు యధాతధంగా అమలు జరుగునట్లు జిల్లాపరిషత్తులు, ప్రభుత్వం జాగ్రత్త వహించాలి.

## సెక్రటేరియట్ స్వరూపంలో మార్పులు

డైరక్టరేట్ కార్యాలయాలకు చెందిన మామూలు విధులను కూడా సెక్రటేరియట్ నేడు ఆకట్టుకొన్నది. సెక్రటేరియట్ స్థాయిలో పరిపాలనా వ్యవస్థను పునర్నిర్మించటంద్వారా దాన్ని తొలగించాలి. విధానాలను రూపొందించటం, ఆచరణ నిమిత్తం నిబంధనలను ఏర్పరటం, ఆర్థిక వ్యవహారాలలో యాజమాన్యం, శాసనాలకు సంబంధించిన వ్యవహారాలు. జరిగిన కృషిని పరిశీలించటం నీనిని నిర్దేశించటం సాధారణంగా సెక్రటేరియట్ (సచివాలయ) విధులు.

ప్రభుత్వం రూపొందించిన విధానాలను అమలు జరిపే బాధ్యత డైరెక్టర్లకు దత్తమైనది కాని ఆచరణలో తమకు దత్తమైన విధుల నిర్వహించటానికి బదులుగా సెక్రటేరియట్, డైరెక్టర్లకు, జిల్లా అధికారులకు చెందిన అధికారాలలో ప్రవేశించటంమూలంగా, తమ మామూలు విధుల నిర్వహణకే లోపం కలుగుతున్నది. దీని ఫలితంగా డైరెక్టరేట్లలోను, సెక్రటేరియట్‌లోను ఒకే పని రెండు సార్లు జరుగుతూ ఉండటం, అనవసరపు అలస్యం కావటం సంభవిస్తున్నది. ఇంతే కాక, డైరెక్టరేట్లు ప్రతి సాధారణ విషయంలోను, సెక్రటేరియట్ ఆదేశాలకు ఎదురుచూడటం జరుగుతున్నది. ఈ పరిస్థితుల దృష్ట్యా పరిపాలనా వ్యవస్థకు కేంద్రమైన సెక్రటేరియట్‌లోనే ముఖ్యమైన మార్పులు అవసరం. సమర్థవంతంగా, వివేకంతో నిర్ణయాలు చేయగల అధికారులు కల డైరెక్టరేట్లకే ప్రస్తుతం సెక్రటేరియట్ నిర్వహిస్తున్న విధులను అప్పగించాలి. బడ్జెట్‌ను రూపొందించటం, ఆర్థిక వ్యవహారాలలో యాజమాన్యం, వీటికి సంబంధించిన తదితర విషయాలు బడ్జెట్, అకౌంట్లు. ప్రభుత్వ ట్రెజరీల బ్యూరో (డైరెక్టరేట్)కు అప్పగించాలి. అయిదులక్షల రూపాయలవరకు, ఆర్థిక విషయాలలో అధికారాలను డైరెక్టరేట్‌ల పరం చేయాలి. న్యాయ సంబంధమైన ప్రకటనలు, నిబంధనల ముసాయిదాలు, కేసులలో న్యాయ సంబంధమైన సలహాలు, వాటికి సంబంధించిన పత్రాల అనువాదం మొదలైన విషయాలను ఒక డైరెక్టరేట్‌కు అప్పగించాలి.

వివిధ శాఖల కార్యకలాపాలను సమన్వయం చేసే బాధ్యత మంత్రివర్గం లేక కౌన్సిల్ కార్యదర్శికి అప్పగించాలి. ఆయనకు సహాయపడేందుకు అవసరమైన ఉద్యోగులను నియమించాలి. ప్రస్తుతం సెక్రటేరియట్ చేస్తున్నట్లు విధానాలను రూపొందించటం, వాటిని అమలుజరిపే

పద్ధతులను ఏర్పరచటంవంటి విధులను డైరెక్టరేట్లలోనే ఒకశాఖను నెల కొల్పి వారి పరం చేయాలి. వాటిని అమలు జరపటం, తదితర విధు లను నిర్వహించేందుకు అక్కడనే మరో ఉపశాఖను నెలకొల్పుకోవచ్చు. దీని ఫలితంగా సెక్రటేరియట్ శాఖలు పూర్తిగా రద్దయిపోయి, పథకా లను సెక్రటేరియట్ ఆమోదానికి పంపటం, వారు ఆమోదించి తిరిగి పంపటం వంటి అనవసరపు ఆలస్యం తప్పిపోతుంది. సెక్రటేరియట్ ఉద్యోగులను డైరెక్టరేట్లలో లీనం చేయటానికి, ఉద్యోగులందరికీ, ఒక విధమైన ఉద్యోగ నిబంధనలను ఏర్పాటు చేయటానికి వీలు కలుగుతుంది.

## సమన్వయ సాధక సమావేశాలు

వివిధ ప్రభుత్వ శాఖల కార్య కలాపాలను సమన్వయం చేసే నిమిత్తం ఆ కాబినెట్ శాఖల అధికారులతో సమన్వయ సాధక సమావేశా లను ఏర్పాటు చేయవచ్చు. సమన్వయ సాధనాధికారిగా వ్యవహరించే మంత్రి వర్గ కార్యదర్శి ఈ సమావేశాలకు అధ్యక్షత వహిస్తారు. అట్టి సమావేశానికి వివిధ అంశాలు, వాటిపై విపులమైన వివరణతో సహా ఎజెండాను తయారు చేయటంమూలంగా వ్యవహారసరళిలోచర్చలు, జరిగి సత్ఫలితాలకు అవకాశం ఏర్పడుతుంది. డైరెక్టరేట్లలోని క్రింది ఉద్యోగులు తరుచుగా చర్చించుకోవటం కూడా అవసరం. దీని మూలంగా నేడు ప్రభుత్వ కార్యకలాపాలకు పెద్ద అవరోధంగా పరిణమించిన అనవసరమైన నిబంధనల పరంపరలు తొలగిపోయి, వివిధ విషయాలను త్వరగా పరిష్కరించేందుకు అవకాశం ఏర్పడుతుంది. అకౌంట్స్ శాఖ నుంచి తీసుకున్న డైరెక్టర్లు, బడ్జెట్ అకౌంట్లు ట్రెజరీల బ్యూరో డైరెక్టర్‌కు బాధ్యులై వివిధ శాఖల డైరెక్టరేట్లలోని, ఆర్థిక వ్యవహా

రాలపై పర్యవేక్షణ జరువుతూ బడ్జెట్ విధానాలను క్రమబద్ధం చేస్తూ ఉంటారు. ఆ శాఖకు సంబంధించిన మంత్రి అధ్యక్షతన, ప్రస్తుతం సెక్రటేరియట్ స్థాయిలో ఉన్న నామకపు సలహా సంఘాలను ప్రతి డైరెక్టరేట్‌లోను, ఆ శాఖ మంత్రి అధ్యక్షులుగా, డైరెక్టర్ కార్యదర్శిగా పటిష్టంగా అనధికారులతో నెలకొల్పటం అవసరం. అమెరికా, బ్రిటన్ దేశాలలో ఉన్న ప్రభుత్వ కమిటీల నమూనాపై. పైన సూచించిన విధంగా పరిపాలనా వ్యవస్థను పునర్నిర్మించటం మూలంగా, సెక్రటేరియట్‌తో నిమిత్తంలేకుండా, ప్రభుత్వ వ్యవహారాలను త్వరితంగా పరిష్కరించే అవకాశం ఏర్పడుతుంది.

పై ప్రతిపాదనలు వెంటనే అమలు జరగటానికి వీలు లేని పరిస్థితుల్లో, డైరెక్టరేట్లకు విస్తృతాధికారాలను యిచ్చి, ఆర్థిక శాఖకు బాధ్యులై ఉండే ఆర్థిక సలహాదార్లను (డిప్యూటీ డైరెక్టరు హోదాలో) నియమించిన పక్షంలో, వారు ఆ యా శాఖలలోని ఆర్థిక వ్యవహారాలను బడ్జెట్ విధానాలను నిర్వహించేటట్టుగా చేయటం మంచిది. జిల్లా పరిషత్తులకు ఆర్థిక విషయాలలో విస్తృతాధికారాలను దత్తం చేసినప్పుడు, ప్రభుత్వ విధానాలను అమలు పరచవలసిన డైరెక్టర్లకు ఆ అధికారాలను ఇవ్వకపోవడంలో అర్థం లేదు. తమ కార్యకలాపాలను డైరెక్టర్లు "సమన్వయ సాధక సమావేశా"లకు నివేదించవలసి ఉంటుంది. డైరెక్టరేట్లకు విస్తృతాధికారాలు లభించటంమూలంగా సెక్రటేరియట్‌లో మిగిలిన అదనపు సిబ్బందిని డైరెక్టరేట్లలోకి తీసుకోవచ్చు.

## రివిన్యూ శాఖ

ఐదుగురు ఉన్నతాధికారులతో రివిన్యూ బోర్డు ఉండగా సెక్రటేరియట్‌లో కూడా మరో రివిన్యూ శాఖ ఉన్నది. బోర్డులోని

ఉన్నతాధికారులు పరిశీలించిన పథకాల విషయంలో సెక్రటేరియట్‌లోని రివిన్యూ శాఖ తిరిగి మరొకసారి అదేపని చేస్తున్నది. వ్యవహారాల పరిష్కారంలో అనవసరంగా ఆలస్యానికి కారణమైన రివిన్యూ సెక్రటేరియట్‌ను తక్షణమే రద్దుచేసి ఆ ఉద్యోగులను రివిన్యూ బోర్డులో లీనంచేసి దీని నంతటిని డైరెక్టరేట్‌గా పునర్నిర్మించాలి. దీనికి ఒక ఉన్నతాధికారి, తదితరులు సహాయ కార్యదర్శులుగా వ్యవహరించాలి. వివిధ ప్రతిపాదనలపై బోర్డువారే తుదినిర్ణయాలుచేసి ఆ శాఖ మంత్రికి, లేదా, మంత్రివర్గానికి నేరుగా పంపాలి. బోర్డు తదితర డైరెక్టరేట్లు తాము సెక్రటేరియట్‌కు పంపే ప్రతిపాదనలను లేఖల రూపంలోకాక, వివరణ రూపంలోపంపాలి. వీటిపై సెక్రటేరియట్‌కుకలిగే సందేహాలను, ప్రశ్నావళి రూపంలో తిరిగి పంపాలి. ఆ ప్రతిపాదనలను ఆమోదించినపక్షంలో మొదటి ఫైలుతో సహా పంపితే, డైరెక్టర్లు ఉత్తర్వులు జారీ చేయవచ్చు.

## సెక్రటేరియట్ శాఖలు

వివిధ శాఖల డైరెక్టర్లకు విస్తృతాధికారాలను ఇవ్వటం మూలంగా ప్రస్తుతం సెక్రటేరియట్‌లో ఉన్న ఉద్యోగులలో చాలామంది అవశ్యకత ఉండదు. ఆ యా శాఖల డైరెక్టరేట్లలోకి వారందరినీ బదిలీ చేయవచ్చును. సెక్రటేరియట్‌ను పూర్తిగా రద్దుచేసి ఆ విధులన్నిటినీ డైరెక్టరేట్ల పరం చేసేవరకు, కొద్ది మంది ఉద్యోగులతో నామమాత్రపు శాఖల నుంచి, శాసనాలు, ఆచరణకు సంబంధించిన నిబంధనలు, ఆర్థిక విషయాలలో యాజమాన్యం వారికి ఇవ్వవచ్చును. అంత వరకు అనవసరపు ఆలస్యాన్ని వీలైనంతగా తగ్గించాలి.

బడ్జెట్ సంఖ్యా వివరాలను ఆ యా శాఖల వారు పంపటం, సెక్రటేరియట్ వాటిని ఆమోదించటం ఒక లాంఛనంగా పరిణమించటం

మూలంగా వివిధ పథకాల తుది అకౌంట్లకు, మొదట సవరించబడిన అంచనాలకు పొంతన కుదరటమే లేదు. శాసనసభ ఆమోదించిన బడ్జెట్ లోని సంఖ్యలను మార్చే పద్ధతికి స్వస్తి చెప్పాలి. లేని పక్షంలో, ప్రతిపాదిత లక్ష్యాలకు, వాస్తవానికి చాలా తేడా ఉండటం జరుగుతుంది. ఈ విషయమై ఆర్థిక శాఖ కట్టుదిట్టాలు చేయాలి. ఆర్థికశాఖ వ్యతిరేకిస్తున్న సందర్భాలలో సామాన్యమైన, వ్యక్తిగతమైన కేసులను కూడా మంత్రులకు పంపి వారి ఉత్తర్వులను పొందటం జరుగుతున్నది. ఈ పద్ధతిమూలంగా ఆర్థిక విషయాలలో అదుపులేకుండా పోవటం. వ్యయం పెరగటం ఏర్పడుతున్నవి. కనుక బడ్జెట్‌లో ఆమోదించిన మొత్తాలను మించ కూడదు.

దీని మూలంగా ఆర్థికశాఖ ఆక్షేపణలు ఎక్కువయ్యే ప్రమాదం ఉందికాని, ఆర్థిక శాఖ కార్యదర్శి లేక ప్రతినిధి ఆ యా శాఖల డైరెక్టర్లు అట్టి సందర్భాల్లో చర్చలు జరపటం మూలంగా దీనిని నివారించవచ్చు. వారిద్దరూ అవసరమని భావించే పక్షంలో ఆ కేసులను పునః పరిశీలనకు పంపవచ్చును. ఆర్థిక వ్యవహారాలు, అకౌంట్లకు చెందిన నిబంధనావళులను కేవలం పునర్ముద్రించటం కాక, పూర్తిగా సవరించటం అవసరం. వీటి పట్ల జరుగుతున్న అలక్ష్యానికి, నేటికీ ఆ నిబంధనలలో కానవచ్చే, "గవర్నర్ జనరల్ కౌన్సిల్" "భారత కార్యదర్శి" వంటి ప్రస్తావనలే తార్కాణం.

సెక్రటేరియట్, డైరెక్టరేట్లు, జిల్లా కార్యాలయాల్లో, అక్కడికి వచ్చే ప్రజలకు కోరిన సమాచారాన్ని ఇచ్చేందుకై, ఒక గదిని, కొందరు ఉద్యోగులను నియమించటం అవసరం. ఇక్కడనే ప్రణాళికా వివరాలను, ప్రభుత్వ శాఖలనుంచి లభించే సాంకేతిక సహాయం, ప్రజా సమస్యలపై జారీ అయిన ఉత్తరువులను కూడా అందుబాటులో ఉంచాలి

వచ్చినవారు తమకు కావలసిన వివరాలు లభించినందుకు సంతృప్తి పొందే విధంగా ఈ కార్యాలయాలు సహాయపడాలి.

## ఉద్యోగ నియామకాలు

వివిధ ప్రభుత్వ శాఖలలో, పై పదవులకు నియామకం లేక ఉద్యోగ హోదా పెరుగుదల విషయంలో అనుసరించ బడుతున్న విధానంపట్ల అసంతృప్తి, నిస్పృహ ప్రబలిపోయినవి. పదవిలో ఉన్న కాలానికి ఉద్యోగ హోదా పెరుగుదల విషయంలో అధిక ప్రాధాన్యత ఇస్తున్నట్టు కనిపిస్తున్నది. కాని ఏ శాఖలోనైనా వ్యక్తుల ప్రతిభపైనే ఆ శాఖ సమర్థత ఆధారపడి ఉన్నది. కనుక ఉద్యోగ హోదా పెరుగుదల విషయంలో ప్రతిభకు కూడా ప్రాముఖ్యత ఇవ్వటం అవసరం. వ్యక్తుల ప్రతిభను నిర్ణయించటానికిగల మార్గాలలో ఆయా ఉద్యోగుల విషయంలో ఏర్పరచిన రహస్య ఫైళ్ళను పరిశీలించే విధానం ఒకటి. కాని, వీటిలో పై అధికారుల ఇష్టానిష్టాలకు ఎక్కువగా తావు ఉన్నది. ఈ విషయాలను చూచేందుకై ఉద్యోగ హోదా పెంపుదల సంఘాన్ని నియమించటం అవసరం. ఆ యా ఉద్యోగులు గత ఆరు మాసాలలో, చేసిన పనిలో నుంచి, కొన్ని ముసాయిదాలను పరిశీలించి దాని ప్రాతిపదికపై వ్యక్తుల ప్రతిభ నిర్ణయించాలె. ఈ ప్రత్యేక సంఘం నిష్పాక్షికంగా వ్యవహరించే నిమిత్తం (విట్లీ కౌన్సిల్) సభ్యుడు, ఉద్యోగుల ప్రతినిధి నొకరిని సభ్యుడుగా చేర్చుకోవచ్చు.

## ఉద్యోగుల శిక్షణ

నేరుగా ఉద్యోగాలలో చేర్చుకోబడిన వారికి శిక్షణ ఇవ్వటం జరుగుతున్నది. ఆ శిక్షణా కాలంలో వారికి వారి నిర్ణీత వేతనంలో

కొంత భాగాన్ని మాత్రమే ఇస్తున్నారు. శిక్షణానంతరం కనీసం రెండు సంవత్సరాలపై ప్రభుత్వోద్యోగంలో ఉంటామని వారినుంచి బాండ్లు తీసుకోవటం జరుగుతున్నది. ఉద్యోగులు ఈ కాలపరిమితి పూర్తయేలోగా ఉద్యోగం వదిలినా, మరో శాఖలో చేరినాకూడా శిక్షణ కాలంలో ముట్టిన మొత్తాన్ని తిరిగి ఇవ్వవలసి ఉంటుంది. మరికొన్ని శాఖలలో శిక్షణ పొందిన ఉద్యోగులున్నా కూడా నేమి. ఉద్యోగాలకు దరఖాస్తు చేసినపుడే ప్రత్యేకార్హతలు కలిగివున్నా శిక్షణ పొందని వారినే నియమించటం జరుగుతున్నది. ఏ శాఖలోనైనా ఉద్యోగులను నేరుగా నియమించిన పక్షంలో వారికి ఆ యా శాఖల కార్యకలాపాలను గురించి శిక్షణ ఇవ్వటం, ఉపన్యాసాల ద్వారా ప్రభుత్వ శాఖల నిబంధనలను బోధించటం అవసరం. శిక్షణాకాలంలో ఆయా పదవులకు నిర్ణీత మొత్తం వేతనాన్ని చెల్లించాలి. జిల్లా కేంద్రాలలో కూడా ఆ శిక్షణకు అవసరమైన ఏర్పాట్లు చేయాలి. నియమించిన ఉద్యోగులు తమ విధులను సక్రమంగా నెరవేర్చ గలగటానికి ఇది చాలా అవసరం.

## ఉతరప్రత్యుత్తరాలలో ఆలస్యం

ప్రభుత్వ కార్యాలయాలలో జరిగే ఉత్తర ప్రత్యుత్తరాలలో చాలా ఆలస్యం జరుగుతున్నది, అనేక సమయాలలో సమాధానం అసలేరాక పోవటం జరుగుతున్నది నిష్ప్రయోజనకరమైన నిబంధనావళుల పరం పరలే ఈ ఆలస్యానికి కారణం . దీనిని నివారించే నిమిత్తం, బ్రిటన్ లోను, మన దేశంలో, కేంద్రంలోను మన రాష్ట్రంలోను నిర్వహణ విధా నాల శాఖ ఒకటి ఉన్నది. అమలులో ఉన్న విధానాలను అవసరాన్ని బట్టి సవరించటం ద్వారా, ప్రభుత్వ కార్య కలాపాలలోని అనవసరపు ఆలస్యాన్ని నివారించటం ఈ శాఖవారి విధి. ఇది ప్రతి ప్రభుత్వ కార్యా

లయంలోను నిరంతరం జరగవలసిన పని. దీని ద్వారా వ్యవహారాలను వీలైనంత త్వరగా పరిష్కరించటానికి గల మార్గాలను నెలకొల్పటం జరుగుతుంటుంది. వివిధ శాఖలలోని ప్రభుత్వ కార్యాలయాల్లో అన్ని స్థాయిలలో ఇటువంటి శాఖలను నెలకొల్పటం అవసరం. అన్ని కార్యాలయాలలోని ఉద్యోగులు ఈ శాఖతో సహకరించటం కూడా అవసరం.

## విట్లీ కౌన్సిళ్ళు

ఉద్యోగులకు, ప్రభుత్వానికి మధ్యఉండే సంబంధానికి చెందిన విషయాలపై స్పష్టమైన వివరణలు లేవు. నేడు దేశంలో జరుగుతున్న అభివృద్ధి, పునర్నిర్మాణ పథకాల విజయానికి ప్రజల సహకారం ముఖ్యంగా ఈ పథకాలను అమలు జరపవలసిన ప్రభుత్వోద్యోగుల సంపూర్ణ సహకారం చాలా అవసరం. ఈ కృషిలో తాము సమాన భాగస్వాములమనీ, తమ శ్రేయస్సు ఈ పథకాల విజయంపైనే ఆధార పడివున్నదనీ వారు భావించనిదే ఈ సహకారం లభించదు. తమ కష్టనిష్టూరాల నివారణకై సంప్రదింపులు జరిపేందుకు తగిన అవకాశం లేనిదే వారికి విశ్వాసం ఏర్పడదు. అందుకోసం విట్లీ కౌన్సిళ్ళ నమూనాపై ప్రభుత్వోద్యోగుల సంఘాన్ని నెలకొల్పి సుహృద్భావ వాతావరణంలో సంప్రదింపులకు అవకాశం కల్పించటం అత్యవసరం.

విట్లీ కౌన్సిళ్ళను పోలిన సంప్రదింపుల సంఘాలను నెలకొల్పాలని రెండవ వేతనాల సంఘంకూడా సిఫార్సుచేసినది. వీటికి బదులుగా ఉద్యోగాల కౌన్సిల్‌ను ఏర్పరచ వచ్చునన్న భావన సరియైనదికాదు. సోషలిస్టు సమాజస్థాపనకై జరుగుతున్న కృషిలో ఉద్యోగులను బాధ్యతాయుతులైన భాగస్వాములుగా పరిగణించడం అవసరం.

సంప్రదింపులు జరిపేందుకు తగిన అవకాశాలు, ఒకేహోదాలో ఒకే పనిచేసేవారందరికీ మధ్య వేతనాలలోగల వ్యత్యాసాలను తొలగించటం మూలంగా, ఉద్యోగులు దేశానికి, ప్రభుత్వానికి విశ్వాసపాత్రులై ఉండగలరు.

అధికార వికేంద్రీకరణ పథకం విజయానికి ఈ సూచనలు చాలా ఉపకరిస్తాయనే ఆశించవచ్చు. జాతికే హానికరంగా పరిణమించిన అవినీతి, స్వార్థాలతో నేడు మన సమాజం నిండిపోయింది. జాతీయతత్వం, వ్యక్తుల నిజాయితీ, దేశభక్తి, సోషలిస్టు సమాజ స్థాపనకై జరిగేకృషిలో పాల్గొనాలనే ప్రజాస్వామిక దృక్పథం నేడెంతయినా అవసరం.



# రివిన్యూబోర్డు పరిశీలన

హార్సిలీ కొండలో ప్రథమంగా సమావేశమైన ఆంధ్రప్రదేశ్ మంత్రివర్గం ఆంధ్రప్రదేశ్‌లో రివిన్యూ బోర్డును రద్దుచేస్తూ నిర్ణయం తీసుకొనడం సంతోషకరమైన విషయం. ఇది యొక చరిత్ర ఘట్టం.

రివిన్యూ బోర్డు రద్దు అనేది జాతీయోద్యమం కోరికలలో ఒకటిగా మొదటినుండి వస్తున్నదికూడా. అంతేకాక పౌరుపు సంఘం ముందు నేనీ విషయం ప్రధానంగా సూచించాను. తీవ్రాలోచన ప్రారంభించారు.

అయితే రివిన్యూబోర్డుకు బదులు కమీషనరులను నియమించ దలచారని, ఈ కమీషనరుల పరిపాలన సాగుతున్న బొంబాయి, మైసూరు రాష్ట్రాలకు ప్రభుత్వము తరపున పరిశీలనకు అధికారులను పంపదలచారని కూడా తెలుస్తున్నది.

ప్రథమంగా రివిన్యూబోర్డు మద్రాసు రాష్ట్రంలో 1789లో ప్రారంభం అయింది. ఆనాడు ప్రభుత్వానికి వస్తున్న అన్నిరకాల వనరుల ఆదాయాన్ని పర్యవేక్షణ చేయుట కుద్దేశింపబడింది. 1804 లో కోర్టు ఆఫ్ వార్డ్సుగా నిర్మాణం జరిగింది. ఈ బోర్డు మొదటి రోజులలో అడవులు వ్యవసాయం, సహకారం, పశుపోషణ, మున్నగువాటితో పాటు, పరిపాలనా సంబంధమైన అన్ని బాధ్యతలు నిర్వహించింది. 1916 లో పరిపాలనలోని వివిధ శాఖలు విడివిడిగా యేర్పాటు చేయబడినవి. అపుడు కూడా ఈ బోర్డు రద్దు విషయమై ప్రస్తావన వచ్చింది. ప్రభుత్వ

అంతస్థులో కూడా ఈ ఆలోచన 1831 నుండి వరుసగా అపుడపుడు వస్తూనేవుంది.

ఇండియాపరిపాలన కలకత్తా లేక ఢిల్లీలోనే కేంద్రీకరింపబడటం కాక, రాష్ట్రాలలోకూడా ఉండవలెనని ఆవిధంగా వికేంద్రీకరణ జరుగవలెననే ఆలోచనతో యేర్పాటు చేయబడిన వికేంద్రీకరణ రాయల్ కమీషన్ 1909 లో దీని విషయం యోచించింది. కార్యనిర్వహణ కౌన్సిల్ (ఎగ్జిక్యూటివ్ కౌన్సిల్)ను విస్తరణ చేయవలెననే ఆలోచన సందర్భంలో కూడా పరిశీలన జరిగింది. రివిన్యూబోర్డు రద్దుతో ప్రాంతీయ కమీషనరులను వేయవలసి వస్తుందని, అందువల్ల జిల్లా కలెక్టరులకున్న అధికారాలు, బాధ్యతలు తగ్గిపోవడంతో స్థాయీ, గౌరవమూ పోతుందని తలంచబడింది.

1920 లో ఇందుకై నియమింపబడిన కమిటీ పై భావాలతో అంగీకరిస్తూ రివిన్యూబోర్డును ఉంచవలసిందిగా సిఫార్సు చేసింది.

1931—32 లో నియమింపబడిన వ్యయ కర్తన కమిటీకూడా ఈ రద్దు విషయం ఆలోచించి రివిన్యూబోర్డు సభ్యులు రాష్ట్రవ్యాపిత పరిమితి కలిగి, జిల్లాపరిపాలనలో ఉన్నతస్థాయి కలిగి నిర్వహణ చేయగలుగుతారని రాష్ట్రవ్యాపితంగా ఒకేపద్ధతి పరిపాలన నిర్వహింప బడుటకు అవకాశం వుంటుందని అందుచే రివిన్యూ బోర్డును ఉంచటము మంచిదని తెల్పారు.

1946—47 లలో శ్రీ టి. వి. రామలింగంచెట్టియారు అధ్యక్షతను సంయుక్త మద్రాసురాష్ట్రంలో యేర్పరుపబడిన మద్రాసు వ్యయకర్తన–పరిపాలనా పునర్నిర్మాణ సంఘం ఈ రివిన్యూ బోర్డు సమస్యను పరి

శీలించింది. రివిన్యూబోర్డు అనేక సమయాల్లో అభివృద్ధికి అడ్డుగా వుంటూనే వున్నదని, ఆనేక అభివృద్ధి రంగాలలో అడ్డు కట్టలు వేస్తూనే వున్నదని, ఇపుడు రివిన్యూబోర్డు అజమాయిషీ చేస్తున్న అనేక శాఖలు, నేడు సమర్థవంతమైన అధికారులుగల వివిధశాఖలుగా ప్రభుత్వంలో కూడా యేర్పడివున్నవని, అందుచే రివిన్యూబోర్డు అనవసరం అని అభిప్రాయం తెలిపారు. అయితే యీ శాఖకు రాష్ట్రాధికారి ఒకరు అన్ని శాఖలకు వలెనే వుండవలసి వుందని, అందుకై భూమిశిస్తు, ఇరిగేషను లకు కలిపి ఒకరిని, వ్యాపార పన్నులకు సంబంధించి ఒక అధికారిని వేయడం బాగుంటుందని సూచించుతూ, అయినా ఆంధ్రరాష్ట్ర విభజన సమస్య వుంది గనుక యథాతథంగానే సాగనీయండి అని తేల్చివేశారు. (పుట 9—10)

## ఆంధ్ర రాష్ట్రంలో

1953 అక్టోబరు 1న ఆంధ్రరాష్ట్ర నిర్మాణం అయింది. ఇద్దరు సభ్యులతో రివిన్యూబోర్డు ఏర్పరచబడింది. అందులోని ప్రథమ సభ్యుడు భూమిశిస్తు, ఎస్టేటుల సెటిల్‌మెంటు కమీషనరు హోదాతోను, రెండవ సభ్యుడు వ్యాపార పన్నులు, ఎక్సైజు మద్యనిషేధ శాఖల అజమాయిషీ లోను వుండేవారు. వీరే నిర్వాసుల ఆస్తికి బాధ్యులుగా వుండేవారు. రాష్ట్రంలోని భూమిశిస్తు వసూలు చేయడంతోబాటు, భూమిరిజిష్టర్లు, సర్వే సెటిల్‌మెంటు, గ్రామీణ నీటి సరఫరా, మైనరు ఇరిగేషను పనుల నిర్వహణ, అగ్నిప్రమాదాలు, కరువులు, వరదలు మున్నగు ఆపద సమయాలలో సహాయగ్రాంటులు ఇవ్వడంకూడా వీరిబాధ్యతలుగా వుండేవి.

తెలంగాణా హైదరాబాద్ సంస్థానములోని భాగంగా వున్నపుడు నైజాం పరిపాలనలో ప్రథమంగా సాలార్ జంగ్ అధికారం స్వీకరించి

నపుడు భూమివిధానాన్ని ఒక పద్ధతిలో పెట్టుటకు ప్రయత్నించాడు. ఆ ప్రయత్నాలతో ఏర్పడినదే ప్రథమ రివిన్యూబోర్డు. బహుశః ఈ ఆలోచన 1863లో ప్రారంభం అయినదనుకుంటాను. అయితే హైదరాబాదులో నాలుగుపర్యాయాలు రివిన్యూ బోర్డు నిర్మాణం చేయడం, నాలుగు పర్యాయాలు రద్దు చేయడం జరిగింది. రివిన్యూబోర్డు రద్దు చేసినపుడు సంస్థానాన్ని కొన్నిజిల్లాలు కలిపి సుబాలుగా నిర్ణయించి, వాటిపై సుబేదారులను నియమించి వారిద్వారా మాల్‌గుజారీ పరిపాలన సాగించారు. సుబేదారు పరిపాలన తన చెప్పుచేతలలో లేదని తలచినపుడు నైజాంనవాబు సుబేదారులను రద్దుచేసి రివిన్యూబోర్డు ఏర్పరచడం మరల రివిన్యూబోర్డు తనయిష్టం వచ్చినట్లు ప్రవర్తించలేదని తలంచి నపుడు ఒక ఫర్మానా జారీచేసి తన యిష్టమైన వారిని సుబేదారులుగా నియమించి తన నిరంకుశపాలన సాగించుటకనువుగా తన యిచ్ఛారాజ్యం సాగించాడు. మొత్తం నాలుగుమార్లు రద్దుచేశాడు. చిట్టచివరకు పోలీసుచర్య జరిగి, ఇండియా పరిపాలనలో అంతర్భాగంగా హైదరాబాదు సంస్థానంలోని రాజ్యాంగ నిర్వహణ ప్రారంభం కావటంతో చివర పర్యాయంగా ( అయిదవ పర్యాయం ) 1949లో రివిన్యూబోర్డు ఒక రిగ్యులేషనుద్వారా యేర్పాటు కాబడింది.

భూమిశిస్తు, ఎక్సైజు, సెటిల్‌మెంటు, భూరికార్డులు, రిజిస్ట్రేషను, స్టాంపులు, ధర్మాదాయాలు, కోర్టు ఆఫ్ వార్డ్సు, కస్టంసు శాఖలపై ఉన్నత కార్యనిర్వహణాధికార సంస్థగా ప్రభుత్వానికి అపీలుచేసుకొనే అధికారానికి లోబడి నడుస్తూంది. ఈ పై శాఖలు, వీటితోబాటు ప్రభుత్వం ఈ బోర్డుకు అప్పగించిన యితర ప్రభుత్వ వనరులపై పరిపాలనబాధ్యత నిర్వహిస్తున్నది. హైదరాబాదులో ముగ్గురు సభ్యులు వుండేవారు.

# 19

## విశాలాంధ్రలో

1956 నవంబరు 1న విశాలాంధ్ర యేర్పడింది. ఈ ఆంధ్ర ప్రదేశ్‌కు కూడా రివిన్యూబోర్డు నిర్మాణం చేశారు. దీనికి అయిదుగురు సభ్యులు. (1) ఇరిగేషను, భూమిశిస్తు కమీషనర్, (2) వ్యాపార పన్నులకమీషనర్, (3) ఎస్టేటు సెటిల్‌మెంటు, సివిల్ సప్లయిస్ కమీషనర్, (4) ఎక్సైజు లాండు రివిన్యూ కమీషనరు, (5) రైత్వారీ సెటిల్‌మెంటు భూసంస్కరణల కమీషనరులంటూ వీరికి నామకరణం చేయబడింది. ఈ అయిదుగురు సభ్యులు గల బోర్డుకు ఒక కార్యదర్శి, జాయింటు కార్యదర్శి, ఒక అదనపు కార్యదర్శి ఎనిమిదిమంది సహాయ కార్యదర్శులు, ఒక ప్రథమ సహాయకుడు (ఫస్టు అసిస్టెంటు) కోర్టు ఆఫ్ వార్డ్సుకు ఒక ముఖ్యాధికారి వున్నారు. వీరితోబాటు వందల సంఖ్యలో ఇతర సిబ్బంది వుంది. 1894 వ సంవత్సరపు రివిన్యూబోర్డు ఆక్టు ప్రకారం ఈ బోర్డు నిర్మాణం జరిగింది. నడుస్తున్నది. దీనికి అధికారాలు ప్రభుత్వ అంగీకారంతో బోర్డువారుచేసిన ప్రకటన మేరకు ఆయా పనులు ఆయా అధికారులచే నిర్వహింప బడుచున్నవి. ఎస్టేటు రద్దు చట్టం, కోర్టు ఆఫ్ వార్డు ఆక్టు, ఆబ్కారీ ఆక్టు, అమ్మకాల పన్ను ఆక్టు, ఇర్రిగేషన్ పన్ను ఆక్టు, భూ ఆక్రమణ ఆక్టు, వంశపారంపర్యం గ్రామోద్యోగుల ఆక్టులకు సంబంధించిన కార్యకలాపాలు ఈ రివిన్యూబోర్డుకు సంక్రమించి వున్నవి.

ఈ రివిన్యూబోర్డు క్రింద ఆంధ్రప్రదేశ్‌లో 1957—58 సంవత్సరంలో 9 లక్షల 19 వేల రూపాయలు, 1958—59 లో 10 లక్షల 30 వేలు వ్యయం అయింది. 1959—60 బడ్జట్టులో 10 లక్షల 9 వేలు దీని వ్యయం క్రింద అంచనా వేశారు. ఈ మొత్తంలో (1) భూమిశిస్తు -

రాజధాని సిబ్బంది (2) స్టేటు ఎక్సైజు, అజమాయిషి — ఎక్సైజు కమీషనరు (3) ఇతర పన్నులు – డ్యూటీలు వ్యాపార పన్నులు అనే ముఖ్య పద్దుల క్రింద వ్యయం అయ్యే మొత్తాలు ఈ పై మొత్తాలలో లేవు. ఈ (1) భూమిశిస్తు — రాజధాని సిబ్బంది పద్దు క్రింద 1957 - 58 లో 3 లక్షల 70 వేలు, 1958 — 59 లో 5 లక్షల 8 వేలు 1959—60లో 5 లక్షల 49 వేలు వ్యయం అంచనా వేయబడింది. అట్లే (2) స్టేటు ఎక్సైజు డ్యూటీస్ అజమాయిషి క్రింద 1957—58 లో 4 లక్షల 26 వేలు, 1958—59 లో 4 లక్షల 45 వేలు, 1959—60లో 3 లక్షల 65 వేలు వ్యయం అంచనా వేయబడింది. (3) ఇతర పన్నులు డ్యూటీ క్రింద 1957—58 లో 56 లక్షల 4 వేలు, 1958—59 లో 57 లక్షల 23 వేలు, 1959—60 లో 67 లక్షల 95 వేలు వ్యయం అంచనా వేయబడింది.

ఈ రివిన్యూబోర్డు మంత్రి వర్గానికి అతీతమైన మంత్రివర్గంగానూ, పని సాగనీయకపోవటానికి చక్రాలలోని చక్రాలుగాను, కాగితాలు అటు ఇటు కదలనీయకుండా ప్రవాహానికి ఆనకట్టలుగాను వుంటూన్నవి.

మొదట గవర్నరు యేర్పడినపుడు వారికివచ్చే పరిమిత ఆదాయాలను లెక్కలు చూచుకోవడమే తప్ప వేరే అంతగా పనిలేని రోజులలో పరిమిత పరిపాలనా బాధ్యతలు నిర్వహణకు యేర్పరచుకున్న బోర్డులే ఈ రూపం దాల్చినవి. తర్వాత కోర్టు ఆఫ్ వార్డ్‌గా నడచినవి. గవర్నరు జనరల్ యేర్పడిన తర్వాత కూడా గవర్నరులు కేంద్ర ప్రభుత్వం క్రింద పరిపాలనా విభాగాలుగా కాక, శాఖలుగావున్న రోజులలో తమలో తాము నిర్ణయాలు తీసుకునేందుకు యేర్పడినవని చెప్పిన బోర్డులే రివిన్యూ బోర్డులు. యూనిటరీ పాలనలో భాగాలుగా నడిచినవి. మింటో మార్లే

సంస్కరణలో కూడా రాష్ట్ర వ్యక్తిత్వం లేని బోర్డులుగనే వుండి పోయాయి. 1920 మాంటు ఫర్డు సంస్కరణలలో యూనిటరీ పాలనే సాగింది. పైగా ఎక్జిక్యూటివ్ కౌన్సిల్ విస్తరణ సమస్యతో వీటి ప్రాధాన్యం తగ్గింది. అయితే అటు తరువాత వికేంద్రీకరణ జరగవలెననే ప్రయత్నం జరిగింది. చివరకు 1935 ఆక్టులో రాష్ట్రాలకు స్వాతంత్ర్యం అంటూ నిర్ణయం జరిగి రాష్ట్ర ఆదాయాలు, అధికారాలు నిర్ణీతమైన తరువాత వివిధ శాఖలు ప్రత్యేకంగా నిర్మాణం కావడంతో దీనికి మిగిలిన శాఖలే తగ్గిపోయినవి. సెక్రటేరియటులో ప్రాధాన్యం యేర్పడింది.

అయితే శాసనాలవలె చలామణి అవుతున్న బోర్డు స్టాండింగు ఆర్డరులు, దానికి సంబంధించిన పరిపాలన, కార్యనిర్వహణకు సంబంధించిన బాధ్యతలు, జిల్లా పరిపాలనలో, వంశ పారంపర్యంగల గ్రామోద్యోగుల ఉద్యోగ సమస్యల లావాదేవీలలో అనుసరింపబడిన పాతపద్ధతులు, సాంప్రదాయ విధానాలు నిర్ణయించుటకు మంత్రివర్గ నిర్ణయాల ప్రభావాలకు అతీతంగావుండే అనుదిన రాజకీయ ఆటు పోటులకు సంబంధంలేని ఒక అధికార వర్గ పాలనా సంస్థగా దీనిని నిర్వహించుతూ వచ్చారు. వీరి నిర్ణయాలపై అంతిమ నిర్ణయాధికారం ప్రభుత్వానికి, మంత్రి మండలికి వుండడంతో మంత్రివర్గ నిర్ణయాల ప్రభావాల కతీతంగా వ్యవహరించ గలగడమనేది ఆచరణలో చివరకు నిరాధారమే అయిపోయింది. అందుచే నిజంగా ఆలోచిస్తే ఇక్ష్వాకుల కాలంలో రివిన్యూ బోర్డులు ఎందుకు నిర్మాణం అయినవో ఆ విధానాలు, అవసరాలు, పరిస్థితులు పూర్తిగా మారిపోయినవి. అందువల్ల వీటి ఉనికికి కాలదోషం పట్టింది. దీనిని రద్దు చేయుటకు ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం నిర్ణయం తీసుకోవటం సమంజసంగా వుంది.

# క మీ ష న ర్లు

దీనిని రద్దు చేయడంతో దీనికి బదులు మరేమి ఏర్పరచవలెననే ఆలోచనతో ఆంధ్ర ప్రదేశ్ జిల్లాలలో కొన్నింటిని ప్రాంతాలుగా ఏర్పరచి వాటిపై కమీషనురలను నియమించి ఆ ప్రాంతీయ పరిపాలన జిల్లా కలెక్టర్లను వి వి ధ శాఖాధికారులను తాబేదారులుగాచేసి, ప్రభుత్వం తరువాత ఈ కమీషనర్ ఉన్నతాధికారిగా పాలన నిర్వహించ వలసిన అవసరం వుందా?

ఈ కమీషనర్ల పాలన బొంబాయిలోనూ మైసూరులోను ప్రస్తుతం నడుస్తున్నది. ఇదివరలో 1959 కి పూర్వం బొంబాయి రాష్ట్రంలో ఈ కమీషనరుల పా ల న సాగించారు. ప్రాత బొంబాయిని మూడు ప్రాంతాలు చేశారు. (1) అహ్మాద్‌బాద్, కైరా, పంచమహల్, బ్రోచ్, సూరత్, ఠాణా, బొంబాయి పరిసర జిల్లా కలిపి ఉత్తర ప్రాంతం, (2) అహమ్మద్‌నగర్, నాసిక్, పూనా, ఉత్తర ఖాందేశ్, దక్షిణ ఖాందేశ్, సతారా, సో లా పూ రు జిల్లాలు కలిపి మధ్య ప్రాంతం, (3) బెల్గాం, బిజాపూర్, ధార్‌వార్, కనరా, రత్నగిరి, కొలాబా జిల్లాలను కలిపి దక్షిణ ప్రాంతంగా విభజించారు. మూడు ప్రాంతాలకు ముగ్గురు కమీషనర్లను నియమించి పాలన సాగించారు. 1950 లో ఈ కమీషనరుల పరిపాలనను రద్దుచేస్తూ (బొంబాయి శాసనం 28 ఆఫ్ 1950) శాసనం చేయబడింది.

1950 లో నూతన రాజ్యాంగం వచ్చింది. రిపబ్లిక్ అయింది. 1956 నవంబరు 1న పాత బొంబాయి రాష్ట్రంలో హైద్రాబాదు, మైసూరు, మద్రాసు, మధ్య ప్రదేశ్, సౌరాష్ట్ర, కచ్‌ల నుండి ప్రాంతాలు కలిపి విశాల బొంబాయి అయింది ఈ విధంగా ఏర్పడిన తర్వాత మరల

ప్రాంతీయ కమీషనరులను నియమించుటకు 1957 లో ఒక శాసనం చేశారు. ఈ శాసనం 1958 జనవరి 10 గెజెటులో ప్రకటన అయింది. 1958 మార్చి 3వ తేదీన అమలులోకి తేబడింది. దీని ఫలితంగా బొంబాయి రాష్ట్రం ఆరుగురు కమీషనరుల క్రింద ప్రాంతాలుగా విభజించటం జరిగింది.

## కమీషనర్ల అధికారాలు

ఈ కమీషనరులు గవర్నమెంటులోని కార్యదర్శితో సమాన హోదా కలిగి వుంటారు. భూమి శిస్తుకు సంబంధించిన వాటిలో తన డివిజనులో ఇతను ప్రధాన కంట్రోలు కలిగిన అధికారిగా ఉంటాడు. తన డివిజనులోని మొత్తం రివిన్యూ అధికారులపై అజమాయిషికీ, కంట్రోలుకు బాధ్యుడై ఉంటాడు. శాసనం ప్రకారం ప్రభుత్వం ఇతనికి హస్తగతం చేసిన, లేక సంక్రమింప జేసిన కార్యనిర్వహణ, పరిపాలనా నిర్వహణ అధికారాలు చెలాయిస్తాడు. తన డివిజనులోని అన్ని శాఖల కార్యాలయాలపై పర్యవేక్షణాధికారం కలిగి వుంటాడు. బొంబాయి రాష్ట్రం పునర్నిర్మాణం కాకపూర్వం స్థానిక సంస్థల డైరెక్టర్లు యేయే అధికారాలు కలిగివుండేవారో ఆ అన్ని అధికారాలతో స్థానిక సంస్థ లన్నింటిని ఇనస్పెక్షన్ చేసే అధికారం కలిగి వుంటాడు. ప్రాంతీయ వివిధ శాఖాధికారుల కార్యకలాపాలను ముఖ్యంగా ప్లానింగు అభివృద్ధి పనులను సమన్వయం చేయడం, తనిఖిచేయడం ఇతని బాధ్యతలలో ముఖ్యమైనవి. తనకు అదనంగా భవిష్యత్తులో వచ్చి కలిసే పరిసరాలలోని పరిపాలనా నిర్మాణాన్ని కూడా సమన్వయం చేసుకుంటుంటాడు.

అధికార వికేంద్రీకరణ దృష్టిలో పెట్టుకొని 1935 అక్టు క్రింది గవర్నరులకు అధికారాలు వికేంద్రీకరించినట్లు (ప్రజా ప్రతినిధులను

గాక) డివిజనల్ కమీషనర్లకు అధికంగా అధికారాలు సంక్రమింపజేయ బడినవి. సామాజకాభివృద్ధి పథకాలు, జాతీయ విస్తరణ సేవా కార్య క్రమాలు వీటికి సంబంధించి ఒక్కొక్క పనికి సంబంధించిన ద్రవ్య అంచనాలు నిర్వహణా కార్యక్రమం, అంగీకరించే అధికారం పూర్తిగా ఇతనికే యివ్వబడింది. ఆర్థిక శాఖకు తెలియ జేయకనే ఇర్రిగేషన్ పనులకు 4 లక్షల రూపాయల వరకు, భూ సంబంధమగు అభివృద్ధి పనులకు ఒక లక్ష రూపాయల వరకు, గ్రామీణ గృహ నిర్మాణ పథకా లకు ఒక లక్ష రూపాయల వరకు, ఇవి గాకుండా ఇతర పనులకు ఒకేసారి 50 వేల రూపాయల వరకున్నూ, అంగీకరింపబడియున్న వివిధ కార్యక్రమాలకు కావలసిన శాంక్షన్లు యివ్వడానికి ద్రవ్యం వెచ్చించడానికి అధికారం యివ్వబడింది. అంతకుముందే అంగీకారం పొందిన స్కీములకు లోబడి ఇర్రిగేషను, రోడ్లు మున్నగు అన్ని పనులకు ఒక లక్ష రూపాయల వరకు చిన్న పనులకు, ఇర్రిగేషన్ పనులకు మరొక లక్ష వరకున్నూ, అట్లే యీ పైపనులు కాకుండా యితర యేపనులకైనా సరే 50 వేల వరకు పరిపాలనా సంబంధమైన అంగీకారం యివ్వవచ్చు. అంగీకరింపబడిన ప్రణాళికలోని ఒక పద్దుగా 25 వేల రూపాయలు అప్పులుగా శాంక్షను చేయవచ్చు.

రివిన్యూ పరిపాలనా సంబంధంగా జిల్లాలోని సబ్ డివిజనుల సరిహద్దులు మార్పు చేయవచ్చు. ఒక పరిమితికి లోనై వ్యవసాయ భూముల వర్గీకరణ మార్పుల ఫలితంగా పన్నుల అంచనా (ఎసెస్మెంటు) తగ్గించవచ్చు. ఆయా ప్రాంతాలలో యేర్పడిన అకాల పరిస్థితులలో భూమి శిస్తు 500 రూపాయల వరకు, జోడీ 100 వరకు ఒక వ్యక్తికి తగ్గించవచ్చు.

పబ్లిక్ వర్క్సు శాఖకు సంబంధించినంత వరకు వారు నిర్మించే రోడ్డు, భవనాలు, వీటికి సంబంధించి పరిపాలనా అంగీకారం ఒక పరిమితికి లోబడి యిచ్చే అధికారం వీరికి సంక్రమింపబడింది.

డివిజనల్ కమీషనర్ తన డివిజనులోనున్న అన్ని రివిన్యూ కచ్చేరీలను, స్థానిక సంస్థల కార్యాలయాలను, అంతేకాక అన్ని శాఖలకు చెందిన అన్ని కార్యాలయాలను ఇనస్పెక్షన్ చేయవచ్చును.

కమీషనరుకు చెందిన విషయాలల్లో ప్రభుత్వము నుండి క్రిందికిగాని, క్రింద జిల్లానుండి ప్రభుత్వానికిగాని అటూ ఇటూ వెళ్ళే అన్ని కాగితాలు ఈ కమీషనరు ఆఫీసు ద్వారానే వెళ్ళవలసి వుంటుంది.

ఇంతేకాక వ్యవసాయ మార్కెటింగు ఆక్టు క్రింద, సినిమా ఆక్టు క్రింద, పోలీసు శాసనం క్రింద, పడవల రహదారి శాసనాల క్రింద, బందిలి దొడ్ల శాసనాల క్రింద, సహకార సంఘాల శాసనాల క్రింద, స్థానిక సంస్థల శాసనాల క్రిందగల అధికారాలను పునర్నిర్మించుకొని సర్వే సర్వత్రా అజమాయిషి, ఇనస్పెక్షను చేయుటకు, నిర్వహించుటకు యీ కమీషనరుకు అధికారం యివ్వబడింది.

ఒక్కొక్క ప్రాంతానికి ఒక్కొక్క కమీషనరు నియమించబడుతాడు. ఒకటికన్నా ఎక్కువ ప్రాంతాలకు కూడా ఒకే కమీషనరును నియమించవచ్చు. అదనపు ప్రాంతాలకు కూడ కమీషనరుగా నియమింపబడవచ్చు. ఒక కమీషనరునుగాక అదనపు కమీషనరును నియమించవచ్చు. అసిస్టెంటు కమీషనరును నియమించవచ్చు. అయితే అసిస్టెంటు కమీషనరు కమీషనరుకు లోబడి వుంటాడుగాని, అదనపు కమీషనరు కమీషనరుతో సమాన హోదా కలిగి వుంటాడు. కమీషనరుకు తాబేదారుకాడు.

ఈ కమీషనరులకు ఎప్పటి కప్పుడు ప్రభుత్వము అదనపు అధికారాలు సంక్రమింపచేస్తూ ప్రకటనలు జారీ చేయవచ్చు. ఈ ప్రకటనల ద్వారా క్రొత్త క్రొత్త అధికారాలు యివ్వవచ్చు. ఉన్నవాటిని ఉపసంహరించవచ్చు, ఉపసంహార ప్రయోగాలు సర్వం రాష్ట్ర ప్రభుత్వంపై ఆధార పడి వుంటవి.

మూడునెలల కొకపర్యాయం గవర్నమెంటు సెక్రటరీలు, డివిజనల్ కమీషనర్లు సంయుక్త సమావేశాలు జరుపుతూ వుంటారు. అట్లే డివిజనల్ కమీషనర్‌లు కూడా వారిలో వారు తమలోని సీనియర్ కమీషనరు అధ్యక్షతను సమావేశమై తమ సంయుక్త సిఫార్సులను ప్రభుత్వానికి అందజేస్తూ వుంటారు. డివిజనల్ కమీషనరులు తరచు జిల్లా కలెక్టర్ల తోను, వివిధ శాఖలకు చెందిన ప్రాంతీయాధికారులతోను సమావేశాలు జరుపుతూ వుంటారు. సర్వ సాధారణంగా ఈ సమావేశాలు డివిజనల్ కేంద్ర కార్యాలయంలోనే జరుగుతూ వుంటాయి.

ప్రతి డివిజనుకు ఆ ప్రాంతీయ అభివృద్ధి సమితి అంటూ ఒకటి యేర్పాటు చేయబడుతుంది. ఇందులో అధికంగా అధికారులుంటారు. అనధికారులుకూడా వుంటారు. దీనికి కమీషనరు అధ్యక్షుడు. ఈ సమితి శాసనబద్ధంగా యేర్పడింది కాదు. ఇది మూడునెలల కొక పర్యాయం సమావేశం అవుతుంది. దీనికి సంబంధించిన ఉపసంఘాలు తరుచు సమావేశం అవుతవి. అభివృద్ధి ప్రణాళికలను గురించి ప్లానింగు కార్య కలాపాలను గురించి సమాలోచనలు జరుగుతుంటవి. వీరి సూచనలు, సిఫారసులు, దీని నిర్మాణం ఎప్పటి కప్పుడు ప్రభుత్వ ఇచ్ఛామాత్రంగా మార్పింప బడతాయి.

బొంబాయి ప్రభుత్వం 1948 లో శ్రీ డి. జి. కార్వే అధ్యక్షతను ఒక పరిపాలనా విచారణ సంఘాన్ని నియమించింది. ఈ సంఘం అప్పటికి అమలులోనున్న కమీషనరుల పాలనపై సమీక్షచేస్తూ తమకు వచ్చిన విజ్ఞాపనలలో ఎక్కువ సంఖ్యాకులు కమీషనరులను ఎత్తివేయవలసినదిగా కోరారని చెప్పారు. (పుట 90) ఈ కమీషనరులు పోస్టాఫీసులవలె అటు ఇటు ఉత్తరాలు నడపటానికి తప్ప ఎక్కువ ప్రయోజనకరంగా లేవని విమర్శలు వచ్చినవని (పుట 92) అందుచే ఈ కమీషనరులను ఎత్తివేయడం అవసరమని సిఫారసు చేశారు. పోతే అవసరమైతే రివిన్యూబోర్డులను యేర్పరచవలసినదిగా సలహా యిచ్చారు. ఈ సలహాలను పాటించి 1950 లో కమీషనరులను రద్దుచేస్తూ శాసనం చేశారు. రివిన్యూబోర్డులు ఎత్తివేయవలెనని ఇతర రాష్ట్రాలలో సాగుతున్న ఆలోచనల ఫలితంగా వారికి రివిన్యూబోర్డు ప్రయోజనం వుందనే విశ్వాసం కలిగివుండక పోవచ్చును. చివరకు పాతపద్ధతే మంచిదిలెమ్మనే మనోతత్వంతో రద్దుచేసిన ఆంధ్రప్రదేశ్‌లో ఆలోచన కమీషనరులను పునరుద్ధరించారు.

## ఆంధ్రప్రదేశ్‌లో ఆలోచన

ఆంధ్ర ప్రదేశ్ మంత్రివర్గం చిరకాలం నుండి వస్తున్న ప్రజాభిప్రాయాన్ని గమనించి. అనుభవంలో దాని ప్రయోజనం కనిపించనందున అందరి అనుభవాన్ని, ప్రజాభిప్రాయాన్ని పురస్కరించుకొని రివిన్యూబోర్డును రద్దుచేయటానికి నిర్ణయించింది.దీనినిబట్టి రివిన్యూబోర్డుఅనుభవం మనకూ కరతలామలకమయింది. బొంబాయి ప్రభుత్వం కమీషనరులు నిష్ప్రయోజనంగా తలంచి, రివిన్యూ బోర్డును నెత్తిన పెట్టుకోటానికి మనస్కరించక చివరకు మరల కమీషనరులను పెట్టుకోవడం మరొక

యోచన చేయలేక పోవడంలోని బలహీనతే అని స్పష్టం అవుతున్నది. రాజస్థాన్‌లో కూడా యిదే జరిగింది.

రాజస్థాన్‌లో అటు రివిన్యూబోర్డు ఇటు కమీషనర్లు రెండు వ్యవస్థలను నడుపుతున్నారట. అచటి రాష్ట్ర ద్రవ్య వ్యవస్థను పరిశీలన చేయటానికి శ్రీ మాధవరావు అధ్యక్షులుగా 1958 లో రాజస్థాన్ ద్రవ్య విచారణ సంఘాన్ని ఆ ప్రభుత్వం నియమించింది. వారు ఈ కమీషనరుల యొక్క అవసరం విషయంలో భిన్నాభిప్రాయా లున్నాయన్నారు. (పుట 236) కాని ఒకవేళ వుంచవలసి వస్తే వారికి తగిన పనిచూపడం అవసరమన్నారు. ఒక రిద్దరిని తగ్గించవలెనన్నారు. మొత్తాన విధిలేక ఉండనీయ మన్నట్లు సిఫారసు చేశారు. కమీషనరులకన్నా ఆంధ్ర మద్రాసులలోవలె రివిన్యూ బోర్డులను పునర్నిర్మించమన్నారు. మన అనుభవంలో మనం వద్దనుకుంటున్నాం.

మైసూరు రాజ్యంలోని పరిపాలన పరిశీలించి నివేదించుటకు శ్రీ ఎ. డి. గోర్వాలాను ప్రభుత్వం నియమించింది. వారు 1958 లో నివేదిక సమర్పించారు. మైసూరులో కమీషనరుల పాలన సాగుచున్నది. ఈ కమీషనరుల విషయం ప్రస్తావిస్తూ శ్రీ గోర్వాలా, వీరు వుండవలసిందేనని, అయితే సంతృప్తికరంగా పనిసాగటం లేదని, పని త్వరలో చేయటానికి ఈ కమీషనరులు యేర్పడ్డారని, కాని జవాబు రావడానికి వారాలు, నెలలు, చివరకు సంవత్సరాలు కూడా గడుస్తున్నవని, ఇపుడున్న సంఖ్య తగ్గించవలెనని సూచించారు. (పుట 7—51) ఈ లోపం వ్యక్తుల కాపాదించడం కాక విధాన లోపంగా భావించవలసి వుంది.

కేరళ రాష్ట్రం యేర్పడక పూర్వం తిరువాన్కూర్ సంస్థానంలో రాష్ట్రి శాఖాధికారుల చేతను, కొచ్చిన్ సంస్థానంలో దివాన్ పేష్కారు చేతను రివిన్యూ వ్యవహారం నిర్వహింప బడింది. తిరువాన్కూరులో ల్యాండు కమీషనరు అంటూ ఒక అధికారి వుండి భూములు, భూమి పన్నులు, సర్వే చూస్తుండేవారు. తిరువాన్కూరు కొచ్చిన్ ప్రాంతాలు మిశితం అయిన తరువాత 1949లో రివిన్యూబోర్డు యేర్పాటు చేయబడింది. రాష్ట్రి పునర్నిర్మాణంతో కేరళ రాష్ట్రం యేర్పడింది. గవర్నరు పాలనతో సాగిన కేరళ రాష్ట్రంలో రాష్ట్రపతి శాసనం ద్వారా 25—2—1957 న రివిన్యూ బోర్డు నిర్మింపబడింది. అటు తర్వాత ఏర్పడిన ప్రభుత్వం ముఖ్యమంత్రి శ్రీ ఇ.యం.ఎస్. నంబూద్రిపాద్ అధ్యక్షతను పరిపాలనా సంస్కరణ సంఘాన్ని నియమించింది.

ఈ కమిటీ రివిన్యూ బోర్డును ఒక సంస్థగా ఎత్తివేసి ఇద్దరు కమీషనరులను నియమించవలెనని సూచించింది. అయితే ఈ కమీషనరులు ప్రాంతీయ కమీషనరులుగా కాక, ఒక కమీషనరు భూమి శిస్తు మతాదాయాలను, కరవు నివారణ, సివిల్ సప్లయిస్ చూడవలెనని, రెండవవారు ప్రత్యేక రివిన్యూ, అమ్మకం పన్నులు, వ్యవసాయ పన్నులు చూస్తుండవలెనని అన్నారు. మిగతా అధికారులు ఆయా శాఖలకు సంబంధించినంతవరకు వీరే నిర్వహిస్తుంటారని, ఈ అధికారులకు అధికంగా అ ధి కా రా లు సంక్రమింప జేయవలెనని సూచించారు. (2వ భాగం పుట 5).

మద్రాసు ప్రభుత్వం కూడా ఆంధ్ర రాష్ట్రం విడివడిపోయిన తరువాత ప్రాంతీయ కమీషనరులను యేర్పాటుచేసి పరిపాలనలో మార్పు తేవలెనని ఆలోచించారు. కాని, రివిన్యూ పరిపాలనా నివేదికలో చేయ

బడిన సూచనలు ప్రస్తుతం అమలు చేయడం ప్రధాన కర్తవ్యంగా నిర్ణయించుకున్నారు.

## మద్రాసు

1956 వ సంవత్సరము మద్రాసు జిల్లా కలెక్టరుల అధికారాల (సంక్రమణ) 41 ఆఫ్ 1956 శాసనంచేస్తూ, ప్రతి కలెక్టరుకు ఒక పరసనల్ అసిస్టెంటును యేర్పరచుచు అధికారాలు నిర్ణయించారు. అది సంతృప్తి కలిగించనందున మరల 1960 లో ఎక్కువ పనులున్న 9. జిల్లాలలో 'జిల్లారివిన్యూ అధికారులు' అంటూ నియమించుచూ పై శాసనాన్ని సవరించారు. ఈ జిల్లా రివిన్యూ అధికారులకు గూడా రెండు జిల్లాలు ఉభయ అర్కాటు జిల్లాలలో పరసనల్ అసిస్టెంటులను నియమించారు. దీనినిబట్టి ప్రాంతీయ కమీషనరులవల్లవచ్చి వొరిగేది యేమీలేదని నిర్ణయించుకొని విరమించారని తేలుతున్నది.

రివిన్యూ బోర్డుకు బదులు ప్రాంతీయ కమీషనరులను నియమించినా ఇప్పటి మధ్య మార్గపు ఆలస్యానికి కారణం తప్పడం లేదు. ఇందుకు పరిష్కార మార్గం ప్రాంతీయ కమీషనరుల నియామకం కాజాలదని తేలిపోయింది. రివిన్యూబోర్డుకన్నా ఖర్చు అధికమే కాగలదు. ఆలస్యము అధికము కాగలదు. మరొక అంతస్థు తప్పలేదు. గోర్వాలా మైసూరు ప్రభుత్వానికి సూచించినట్లు ఈ కమీషనరుల ఆఫీసులు జిల్లా కేంద్రాలలో కాక చిన్న పట్టణాలలో యేర్పాటు చేయమన్న సూచనను అమలు జరిపితే పరిపాలనా కేంద్రం జిల్లా కేంద్రంలో లేనపుడు రాజధానిలోవున్నా ఒకటే, మరో పట్టణంలోవున్నా ఒకటే అవుతుంది. కొత్తగా వచ్చి వరిగిన సౌకర్యం ఏముంటుంది. తిరుగుడు, శ్రమ, వ్యయం, పునరుక్తి తప్పడం లేదు.

చివరకు తేలింది ఇది. అయితే రివిన్యూబోర్డు లేకపోతే కమీషనరులు అది కాకపోయింది, ఇది కాకపోతే అది అంతేనా, లేక మరో మూడో మార్గం వుందా అనేదే నేటి మీమాంస.

## ఆంధ్రరాష్ట్రం — పరిపాలన

అక్టోబరు 1,1953 నుండి యేర్పడనున్న మన ఆంధ్రరాష్ట్రం పొదుపరితనం అవలంబించడం చాలా ముఖ్యం. సిబ్బందిలో కూడా అనేక మందిని ఎక్కడివారిని అక్కడే వుంచినందున ఉన్నత ఉద్యోగాలలో ఆంధ్రులు చాలా తక్కువే వున్నారు. బయటివారిని తీసికొనివచ్చి ఆంధ్రులకందరికి ప్రమోషనులు యివ్వవలసినపుడు అడ్డంకులయ్యే దానికన్నా ఇపుడే శ్రద్ధ వహించడం మంచి దనేవిషయం ప్రతీపార్టీ అంగీకరించిన విషయమే. ఆంధ్ర రాష్ట్రం పరిపాలన విధిగా తెలుగులో జరగాలి కూడా.

ఇంతవరకు మద్రాసు ప్రభుత్వంలో పనిచేస్తున్న శాఖలు 12, ఈ శాఖలు ఒకటికి మరొకటివంతున ఉన్నతాధికారుల కొరకు పెంచి పెంచి కార్యదర్శి, అతని క్రింద సంయుక్త కార్యదర్శి, అతనికి సహాయ కార్యదర్శి, ఇంకొక సహాయ సంయుక్త కార్యదర్శిగా ఉన్నతాధికారులను పెంచుతూ వచ్చారు. ఆనాడు ఎక్కువ సర్వీసు సమర్థవున్నవారు. ఆంధ్ర, తమిళ అభిమాన దురభిమానాల వల్ల వెనుకనే వుండడం తటస్థించింది. ఈ మొత్తం పరిస్థితులు గమనించితే ఈ వివిధ శాఖల పెంపుదల ఉన్నతోద్యోగుల కోసంగా చేయడం మానివేసి మొత్తంగా ఒక ప్రధాన కార్యదర్శి, అతని శాఖతో బాటు మరి అయిదు ప్రధాన శాఖలు, కార్యదర్శులు ఉండేవిగా ఏర్పాటుచేసి మొత్తం 6 శాఖలుగా

ప్రభుత్వాన్ని విభజించి, అంతమందే మంత్రులు కూడా ఉండేటట్లు ఏర్పరచుకోవాలి. ప్రతిశాఖకు ఒక కార్యదర్శి, అతని క్రిందవుండే వివిధ శాఖలకు అనుభవం, సమర్థత, చొరవ ఉన్న సూపరెంటెండెంటులను ఏర్పరచి కాస్త సిబ్బంది ఎక్కువగా నైనా ఇచ్చి ఇదివరకున్న డొంక తిరుగుడు అనవసర చాదస్తపు పద్ధతి తగ్గించడం మంచిది. ఈ పద్ధతి అవలంబించితే, అచ్చం ఆంధ్రులతోనే ప్రభుత్వం నిర్వహించవచ్చు. ఆంధ్రేతరులను కోరవలసిన అవసరం లేకుండా సెక్రటేరియట్ సాగించవచ్చు.

రివిన్యూ బోర్డు ఎత్తివేయడం అవసరం అని కాంగ్రెసు పుట్టినప్పటినుండి వాదిస్తూ వచ్చింది. దీని సభ్యులకు ఈనాడు నెలకు రు. 3750 నుండి రు. 3000 వరకు చెల్లిస్తున్నారు. ముగ్గురు, నలుగురు ఉంటున్నారు. ఇక కార్యదర్శుల హోదాలో ఐ. సి. యస్. వారికి నెలకు రు. 2500 నుండి రు. 1000 వరకు జీతాలుంటవి. ఏ. ఏ. యస్. వారికి రు. 1800 నుండి రు. 800 వరకు ఉంటున్నది. చీఫ్ సెక్రటరీగా రాగల ఒక్కరిని మినహాయిస్తే అసలు ఆంధ్రులలో మరిద్దరున్నారు అంతే. అందువలన కార్యదర్శులను అనుభవము గల ఐ. ఎ. యస్. వారిని వేసుకుంటే సరిపోతుంది.

ఇట్లాగే ఉద్యోగస్థుల విషయం అన్ని వివరాలు చర్చించడం నా ఉద్దేశ్యంకాదు. సాధ్యంకాదు. అట్లే సిబ్బందిని అంతా తగ్గించ మనడం కూడా నా ఉద్దేశ్యం కాదు. తగిన సిబ్బంది లేకపోతేను, వారికి తగిన ప్రతిఫలం లేకపోతేను పని కుంటువడుతుంది. వారు ప్రక్కదారుల ఆదాయానికి చూస్తారు. ఆంధ్రరాష్ట్రం లంచగొండితనం లేని రాష్ట్రం కావాలి. అందుకు ఆంధ్రాభిమానం అధికారులలోను, ఉద్యోగులకు తగిన

వసతులు కల్పించపలెననే అభిప్రాయం అధికార పర్గాలలోను ఉండాలి. అందుకై శాఖలను తగ్గించి సూపరెంటెండెంటులను ఉన్నతస్థానములలో ఉంచితే ఒకటి రెండు సంవత్సరాలలో ప్రమోషనులు ఇవ్వవచ్చును. ఆవిధంగా వారిని గుర్తించడం జరుగుతుంది. ఇట్లే జిల్లా పాలనలో ప్రతిశాఖ విషయంలోనూ.

## జిల్లా పరిపాలన

జిల్లా పరిపాలనలో కూడా కొన్ని మార్పులు రావాలి. ఈనాడు జిల్లా కలెక్టరు ఎంత సర్వాధికారియో అంత అధికార భారంతో క్రుంగు తున్నాడు. తీరికలేనివా డవుతున్నాడు. ఒకరిద్దరివద్ద తప్ప ఆఫీసులో కాగితాలు కదలడంలేదు. ఈనాడు అధికారమంతా అతి కేంద్రీకరణతో సాగిపోతున్నది. అది కొంత వికేంద్రీకరణ జరగాలి. న్యాయశాఖ కార్యవర్గ శాఖలు కొన్ని జిల్లాలలో విడదీసిన తరువాత కొంత భారం తగ్గి యుండవచ్చు. విధిగా ఈ విభజన జరగాలి. దీనితో జిల్లా మేజిస్ట్రేటు పనులు తనకు లేనందున జిల్లా కలెక్టరు పనులు కొన్ని తగ్గుతాయి. దీనికి తోడు డిప్యూటీలు అధికంగా వుంటున్నారు. డిప్యూటీకలెక్టరు, డిప్యూటీ సూపరెంటెండెంటు ఇట్లాంటివి చాలావున్నాయి. రెండు తాలూకాలకు ఒక డిప్యూటీనుంచి జిల్లా అధికారి పనులు వికేంద్రీకరణంలో వీరికిచ్చి కొందరు జిల్లాధికారులనైనా తగ్గించాలి. లేక తాలూకా అధికారులకేఎక్కువ అధికారాలిచ్చి, ఈ డిప్యూటీలనైనా తగ్గించాలి. పరసనల్ సెక్రటరీ అని అడిషనల్ ఆఫీసర్లని తలభారం చేసివేస్తున్నారు. ఇది ప్రతి శాఖలోను ఉన్నదే. అందువలన ప్రతిశాఖలోను పునఃపరిశీలన జరిగి పునఃనిర్మాణం చేయాలి. అసలు జిల్లాల సంఖ్య పెంచి, జిల్లాల వైశాల్యం తగ్గించి నందువల్ల అపని సుళువు కావచ్చు. ఈ విధానం ఇప్పుడే తేల్చుకోకపోతే

ఆంధ్రరాష్ట్ర విభజనలో ఈ ఉద్యోగుల నిర్ణయ విషయం ఎవరో నిర్ణ యించి ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వంమీద రుద్దడం, తరువాత ఇందులో ఒక చిన్న మార్పుకూడా చేయ వీలులేకపోవడం, అధిక భారమగు సిబ్బందిని తెచ్చుకోవడం అవుతుంది. అసలు ప్రభుత్వ యంత్రాన్ని, ఇపుడున్న నిబంధనలు గిరిగీతలు సరిదిద్దడానికి ఆంధ్రరాష్ట్రం ఏర్పడడం కాదన్న మాట నిజమే. కానివున్న అవకాశాలలో రాష్ట్రపాలన నిర్వహించడానికి అనవసర ఆడంబరం, పటాటోపం, పనినష్టం, చేసిందే చేస్తుండడం, ఆలస్యమూ జరుగకుండా సమర్థంగా ప్రజాదరణ పొందగలిగి ప్రజలకు అందుబాటులో ఉండేటట్లు చూచుకోవాలి. ఈవైపు ఖర్చులు తగ్గించుకొని వైద్య, విద్య, వ్యవసాయ, పరిశ్రమాభివృద్ధికి ఎంతగా ఖర్చు చేయ గలిగినా అది అంతా ఆంధ్రరాష్ట్ర ప్రజల అభివృద్ధికి, ప్రభుత్వ గౌర వానికి మూలధనమే అవుతుంది. *(ఉగాది 15-3-53).*

## రివిన్యూబోర్డు లేక రివిన్యూశాఖ ?

సంయుక్త మద్రాసు ప్రభుత్వం శ్రీ యం. వి. సుబ్రహ్మణ్యం అధ్యక్షతను 1950 లో భూసంస్కరణల కమిటీని నియమించింది. వారు భూసంస్కరణలకు సంబంధించిన సూచనలు చేస్తూ రివిన్యూ పాలనా విధానాన్ని కూడా సమగ్రంగానే చర్చించారు. వీరు రివిన్యూబోర్డుకు ప్రత్యామ్నాయం ప్రాంతీయ కమీషనరులు కాజాలరనీ, వారు అధిక వ్యయ కారణంఅని అన్నారు. రివిన్యూశాఖకు కూడా ఇతర శాఖల కున్నట్లే రాష్ట్రాధికారులుండడం అవసరం అని, వారే కలిసి ఆలోచించు కోడానికి బోర్డుగా వుంటే మాత్రం ఇబ్బంది యేమీ వుండదని, అయితే బోర్డువల్ల ఆలస్యం ఎక్కువవుతున్న విషయం అంగీకరించుతున్నామని, అయితే ఈ ఆలస్యానికి కారణం బోర్డు ఉనికి కారణం అనటానికన్నా

బోర్డు మొదటినుండి ప్రతి కాగితం పరిశీలనచేసి దాని పుట్టు పూర్వో త్తరా లన్నీ కూలంకషంగా చర్చిస్తూ దీర్ఘంగా వ్రాసిన వివరాలను, సెక్రటేరియట్‌లోని రివిన్యూశాఖలో మరల మొదటినుండి తుదివరకు రెండవమారు పరిశీలన చేయడం జరుగుతున్నదని దీనివల్ల ఎంతోకాలం, ధనం వ్యయం కావడముకారణం అన్నారు. అసలు పని ఆలస్యం కావడం జరుగుతున్నదని అందుచే బోర్డు చేసినపనినే గవర్నమెంటు సెక్రటేరి యట్‌గా నిర్ణయించితే, ఇది సెక్రటేరియట్ కాగితం కావడం జరుగు తుందని, అందువల్ల కాలం, శ్రమ, ధనం, వ్రాసిన సమాచారంఅంతా కలిసివస్తుందని. ప్రభుత్వ నిర్వహణ ఒక అవసర అంతస్థును దాటివేయ వచ్చునని,అందుచే ఈ రివిన్యూబోర్డు సభ్యులనే ప్రభుత్వ రివిన్యూశాఖా కార్యదర్శులుగా కూడా నియమించితే, సమస్య తేలిపోతుందని సూచించారు.( పుట 91 ).

ఈ విధానం సంయుక్త బెంగాలు ప్రభుత్వం 1944 లో సూచిం చింది. ఇండియాకు స్వతంత్రము రాకపూర్వం యుద్ధ ఫలితంగా సంభ వించిన ఆహార కరువు వల్ల ఆర్థికవిధానమేకాక, పరిపాలనా విధానం కూడా బెంగాలు రాష్ట్రంలో తారుమారయినపుడు 1944 లో సంయుక్త బెంగాల్ ప్రభుత్వం సర్ ఆర్చిబాల్డు రవులాండ్స్ అధ్యక్షతను పరిపాలనా విధాన పరిశీలనసంఘాన్ని నియమించింది. ఈ సంఘంవారు పరిపాలన వ్యవస్థీకరణను గురించి సమగ్ర విచారణ చేశారు. ఈ నివేదిక తర్వాత వచ్చిన పరిపాలనా నివేదికలను ప్రాతిపదికగా భావించడం జరిగింది. ఈ కమిటీవారు కూడా రివిన్యూబోర్డు సభ్యులనే రివిన్యూశాఖా కార్య దర్శులుగా నియమించి ఆర్థికశాఖ కార్యదర్శులద్వారా మంత్రుల వద్దకు వెళ్ళవలసిన అవసరం లేకుండా సరాసరి రివిన్యూమంత్రి వద్దకు, ఆర్థిక శాఖా మంత్రి వద్దకు సరాసరే వెళ్లే అవకాశం కలిగించి రివిన్యూశాఖను

రద్దు చేయవలసిందిగా సూచించారు. ( నివేదిక పుట 4-5 ). ఈ సుబ్రమణ్యం కమిటీ సూచనల ఆలోచనకు ఈ రవులాండ్స్ కమిటీ సూచనలు అవకాశం కలిగించింది అనిపిస్తున్నది. ఐతే రవులాండ్స్ కమిటీ రివిన్యూశాఖను రద్దు చేయవలసిందిగా సూచించితే, సుబ్రమణ్యం కమిటీ రివిన్యూ బోర్డును రద్దుచేసి రివిన్యూశాఖను మిళితముచేస్తే, సరిపోతుంది అన్నారు.

ఈ సూచనతో ఒక పరిష్కారమార్గం అట్లే ఒక సమస్య కూడా ఉత్పన్న మవుతున్నది. ఈ కమిటీయే ఒక సమస్యను అంటే ఆ యా శాఖలకున్న రాష్ట్రి ఉన్నతాధికారియే ప్రభుత్వం సెక్రటేరియట్‌లో కార్యదర్శిగా వుంటే మరి ఆ శాఖకు కార్యదర్శి కాకుండా బయట ఒక ఉన్నతోద్యోగి లేకుండా పోతాడే అనే సమస్యను లేవదీసింది. అయితే ఆ సమస్యకు జవాబుగా రివిన్యూశాఖకు అట్టే ఇబ్బందిలేదని అందుచే రివిన్యూ బోర్డు సభ్యులను - రివిన్యూశాఖకు రాష్ట్రాధికారులుగా ఉన్నా వారిని - ప్రభుత్వ కార్యదర్శులుగా చేస్తే బెడద వదిలిపోతుందని తేల్చివేశారు. (పుట 91). దీనితో రాష్ట్రి శాఖలకు ఉన్నతోద్యోగిని ప్రభుత్వ శాఖలలో కార్యదర్శిగా చేయవలసిందని ఈ నాటి రివిన్యూబోర్డువల్ల సంభవిస్తున్న ఇబ్బందులు తీరిపోతవన్నారు. ఈ సూచన చాలా బాగా వుంది.

దీనితో రాష్ట్రాధికారులు వేరే వుండనవసరం లేకుండగనే ప్రభుత్వ కార్యదర్శి రెండూ ఒకరుగనే పరిపాలన సాగించవచ్చునని తేలిపోతూన్నది. అయితే రివిన్యూపరిపాలనను నిర్వహించే రివిన్యూ కార్యదర్శినే రాష్ట్రాధికారిగా కూడా వ్యవహరించ వలసిందిగా నియమించుకోవచ్చుగదా.

ఈ విధానం సరికాదని శాఖాధికారి ప్రత్యేక ప్రవీణుడయి వుంటాడని, ప్రభుత్వ కార్యదర్శి పరిపాలనా విధానం తెలిసినవాడై వుంటాడని

అందుచేత తగు సలహాలు యివ్వడంలో సహాయపడతారని ఈ రెండూ కలిపివేయడం సరికాదని బొంబాయి శ్రీ కేల్ కమిటీ సూచించింది. (పుట 69). ఈనాడు ఆ యా శాఖలకు సంబంధించిన ప్రవీణత లేకపోయినా ఆ యా శాఖలకు ఉన్నతోద్యోగులుగా క ఐ. ఎ. యస్. అధికారులను వేస్తుండడం ఆ యా శాఖలలో రాష్ట్రి ఉద్యోగులుగా ఉన్నందున నేమి సీనియారిటీ లభించినందుననేమి ఐ. ఎ. యస్. లభించిన వారిని పరిపాలనానుభవం ఏమీలేకపోయినా జిల్లా పరిపాలనాధికారులుగా నియమించడం పరిపాటి అయింది. అందువలన ఈ వాదం ఇపుడు నిల్వజాలదు. అంతేకాదు, శ్రీ నంబూద్రిపాద్ కమిటీ రిపోర్టులో ప్రభుత్వ కార్యదర్శులు, శాఖోన్నతోద్యోగులుగా ఉండేవారి పనులు మిళితం చేయడం అనేది ఈ ప్రభుత్వం (కేరళ) అమలు జరుపుతుండడమే దానిని యథాతథంగా అంగీకరించటాన్ని, అవసరాన్ని, ఉపయోగాన్ని రుజువుచేస్తుంది అన్నారు. (పుట 85 భాగం 1).

ఇదేమి కొత్తపద్ధతికాదు. ఇంగ్లాండులో ఆ యా శాఖల శాశ్వత ముఖ్య కార్యదర్శులే (పర్మెనెంట్ ప్రిన్సిపల్ సెక్రటరీస్) ఆ యా శాఖాధికారులుగా వున్నారు. అది యూనిటరీ ప్రభుత్వం అయినా మన రాష్ట్రాలు అంతకన్న పెద్దవికావు. అంతకన్న పెద్ద అధిక సంఖ్యాక సమస్యలు వున్నవి అనజాలం. ఈ కార్యదర్శులు స్థానికంగా పర్యవేక్షణ చేయటానికి ఒకరిద్దరు ఇనస్పెక్టరులను, సూపర్వైజరులు తమక్రింద వుంచుకుంటారు. అమెరికా సంయుక్త రాష్ట్రాలలో ప్రభుత్వ కార్య దర్శియే శాఖోన్నతాధికారిగా వుంటున్నాడు. కొన్ని చోట్ల మంత్రులే ఆ యా శాఖలకు ఉన్నతాధికారులుగా వుంటున్నారు. ఇండియాకు ఇది క్రొత్తగాదు. ఇండియాలోకూడా ఈ పద్ధతి అమలు జరుపబడుతూంది.

అన్నిటికన్నా మిన్నగా ముఖ్యశాఖగా తలంచే పోలీసు శాఖకూడా హోం డిపార్టుమెంటు కార్యదర్శి ఇనస్పెక్టరు జనరల్ ఆఫ్ పోలీసు ఒకరే వుండటంకూడా గమనించవచ్చు.

## కార్యదర్శులతే శాఖోద్యోగులు

రివిన్యూ :- బెంగాలు, పంజాబ్ :- బెంగాలులో బోర్డు రివిన్యూ సభ్యుడే ప్రభుత్వరివిన్యూ శాఖా కార్యదర్శి. పంజాబులో (ఫైనాన్షియల్ కమీషనరు ఆఫ్ రివిన్యూ) భూశిస్తు ఆర్థిక కమీషనర్ రివిన్యూడిపార్టు మెంటుకు కార్యదర్శి రివిన్యూ ఆర్థిక కమీషనరే ప్రభుత్వ డిప్యూటీ కార్యదర్శి.

పోలీసు :- పంజాబ్, అస్సాం :- ఈరెండు రాష్ట్రాలకు పోలీసు ఇనస్పెక్టర్ జనరలే హోం డిపార్టుమెంటుకు జాయింటు కార్యదర్శి.

పబ్లిక్‌వర్క్సు: బొంబాయి, బీహారు, పంజాబు, ఒరిస్సా, సింధు సరిహద్దు రాష్ట్రాలు : ఈ అన్ని రాష్ట్రాలలోను చీఫ్ ఇంజనీయరులే పబ్లిక్ వర్క్సు డిపార్టుమెంటు కార్యదర్శులుగా ఉన్నారు. బీహారులో అదనపు చీఫ్ ఇంజనీరు అదనపు సెక్రటరీగాను, డిప్యూటీ చీఫ్ఇంజనీరు డిప్యూటీ కమిషనరుగాను వున్నారు.

పరిశ్రమలు:- పంజాబు, అస్సాం:- అస్సాంలో డైరెక్టరు ఆఫ్ ఇండస్ట్రీస్ ప్రభుత్వానికి అడిషనల్ కార్యదర్శిగా వున్నాడు. పంజాబులో ఫైనాన్షియల్ కమీషనర్ ఫర్ డెవలప్ మెంటు, డెవలప్ మెంటు శాఖకు కార్యదర్శిగాను, ఫైనాన్షియల్ కమీషనరు కార్యదర్శి ప్రభుత్వానికి డిప్యూటీ కార్యదర్శిగాను వున్నారు. అస్సాంలో డైరక్టర్ ఆఫ్ ఇండస్ట్రీస్ ప్రభుత్వానికి అడిషనల్ సెక్రటరీగా వున్నాడు.

సహకారం:- అస్సాం:- అస్సాంలో రిజిష్ట్రార్ ఆఫ్ కోఆపరేటివ్ సొసైటీస్ ప్రభుత్వపు స్థానిక స్వపరిపాలనా శాఖకు అదనపుకార్యదర్శిగా వున్నారు.

విద్య:- పంజాబు :- డైరక్టర్ ఆఫ్ పబ్లిక్ ఇన్‌స్ట్రక్షన్ ప్రభుత్వానికి కార్యదర్శిగా ఉన్నారు. హైదరాబాదులోనూ ఉండెడిది. (ఇట్టి ఘటనలు యితర రాష్ట్రాలలోనూ వున్నవి. వివరాలు లభించలేదు.

ఆహారం:- బొంబాయి, బీహార్, పంజాబ్, మద్రాసు రాష్ట్రాలు ఒరిస్సా సింధు:- బొంబాయిలో డైరెక్టర్ ఆఫ్ సివిల్ సప్లయిస్ ప్రభుత్వ. జాయంటు కార్యదర్శి గాను, ఫుడ్‌కంట్రోలర్ డిప్యూటీ కార్యదర్శిగా వున్నారు. బీహారులో చీఫ్ కంట్రోలర్ ఆఫ్ ప్రైసెస్ అండ్ సప్లయిస్ గవర్నమెంటులో కార్యదర్శిగాను, డైరెక్టర్ జనరల్ ఆఫ్ ఫుడ్ గవర్నమెంటు సప్లయి శాఖకు అదనపు కార్యదర్శిగాను వున్నారు. మధ్య రాష్ట్రాలలోనూ, సింధు ఒరిస్సాలలోనూ డైరెక్టరు లేక కంట్రోలరుగాను వున్నవారు ప్రభుత్వంలో కార్యదర్శిగాకూడా వున్నారు.

రవాణా :- బెంగాలు, పంజాబ్, ఒరిస్సా. బెంగాలు రాష్ట్ర ట్రాన్స్‌పోర్టు కంట్రోలర్ హోం డిపార్టుమెంటు కార్యదర్శిగను, ఒరిస్సా, పంజాబులో రవాణా కంట్రోలరు ప్రభుత్వ కార్యదర్శిగాను వున్నారు.

రాష్ట్ర శాఖల ఉన్నతోద్యోగులను ప్రభుత్వ కార్యదర్శులుగా నియమించి అటుప్రభుత్వ కార్యకలాపాలను, ఇటు ఉన్నతోద్యోగుల బాధ్యతను నిర్వహింపచేసినందున వ్రాసిందే వ్రాసేపద్ధతి పోతుంది. అనవసర కాలయాపన లేకుండా పని కలిసివస్తుందనే వాదాన్ని శ్రీ యల్. వెంకట. కృష్ణయ్యర్, కె. పి. కృష్ణనాయర్‌లు మద్రాస్ రాష్ట్రంలోని శ్రీ రామలింగం చెట్టియార్ నివేదికలో భిన్నాభిప్రాయాన్ని ప్రకటించుతూ దీర్ఘంగా

సహేతుకంగా సూటిగా వివరించారు. (పుట 100-101). అటు శాఖోన్న తోద్యోగులుగాని ప్రభుత్వ కార్యదర్శులుగాని, అనుభవంవున్న సీనియర్ అధికారులే వస్తారుకాని క్రొత్తవారు రావడం జరగదు. ఒకవేళ వచ్చినా చొరవ, చురుకుతనం వివేకం వుంటేనే ఈ స్థాయి అందుకో గలుగు తారు. ఆ సందర్భంలో ప్రభుత్వ కార్యదర్శులనే ఆయా శాఖల ఉన్నతో ద్యోగులుగాకూడ నియమించితే సరిపోతుంది.

ఇంత ఎందుకు ఈనాడు అన్నిశాఖలకన్న మిన్నగా గణింప బడు తున్న ఈనాటి సాంఘిక, ఆర్థిక, రాజకీయ జీవితంలో ప్రధానస్థానం వహించుతున్న శాఖగా పరిగణించుచున్న ప్లానింగుశాఖ విషయం ఆలో చించండి. ఇంతవరకు రాష్ట్రి ఉన్నతోద్యోగులను ప్రభుత్వ కార్య దర్శులుగా నియమించినట్లు చూశాం. ఇపుడు ప్రభుత్వ కార్యదర్శులను రాష్ట్రి ఉన్నతోద్యోగులుగా నియమించడం గమనించ గలుగుతాము. ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి డెవలప్‌మెంటు కమీషనరుగా నియమింప బడ్డాడు. అదనపు డెవలప్‌మెంటు కమీషనరుగా ప్లానింగు డెవలప్‌మెంటు శాఖా కార్యదర్శిని నియమించారు. ప్లానింగు శాఖలోనున్న డిప్యూటీసెక్ర టరీలు, జాయంటు సెక్రటరీలు అసిస్టెంటు సెక్రటరీలు డిప్యూటీ కమీష నరులుగాను, జాయింటు కమీషనరులుగాను, అసిస్టెంటు కమీష నరులుగాను నియమింపబడ్డారు. ఈ నాడు ప్రధానశాఖగా ఎంతో ధనాన్ని వెచ్చించుతూ అనేక ప్రాంతాలపై అజమాయిషి చేస్తున్న ప్లానింగు శాఖకు రాష్ట్రి స్థాయిలో ప్రభుత్వ సెక్రటేరియట్‌లో కాకుండా వేరే ఒక కార్యాలయం, సిబ్బంది, వ్యవహారం ఏమీ లేకుండా అంతా ప్రభుత్వ సెక్రటేరియట్‌నుండే నడుస్తున్నది.

ఈ శాఖ ఈ విధంగా నిర్వహింపబడుతున్నప్పుడు పై అంత స్థులో సెక్రటేరియట్‌వద్ద క్రింది అంతస్థులో జిల్లాస్థాయిలో ఖంఖా

క్రిందికి పోతే బ్లాకుస్థాయిలో ఇంత అభివృద్ధి కార్యక్రమం నిర్వ హించ గలుగుతున్నప్పుడు, రివిన్యూబోర్డును రద్దు చేసినంత మాత్రాన రివిన్యూ పరిపాలన రాష్ట్రస్థాయిలో రివిన్యూ సెక్రటేరియేటులోనూ, క్రింది అంతస్థులలో జిల్లాస్థాయిలోను, అంతకు క్రింది స్థాయిలో తాలూకా స్థాయిలోనూ ఎందుకు జరుగదు ? అవసరమైతే జిల్లాలలోని విషయాలు తెలుసుకోవలెనంటె ప్రభుత్వ కార్యదర్శులలో నెవరినైనా పంపుతుండ వచ్చు. పరిపాలన సాగించవచ్చు. వేరే మధ్య అంతస్థులో ప్రాంతీయ కమీషనర్లు, వారి ఆఫీసులు అందువల్ల ఆలస్యం, చేసినపనే ప్రతి అంతస్థులో చేయడం వ్యయం—అధిక వ్యయం ఎందుకు ? అందుచే రివిన్యూ బోర్డును రద్దు చేయదలంచిన నిర్ణయాన్ని అమలు జరిపి ఈ రెండు పద్ధతుల మధ్య ప్రాంతీయ కమీషనరులను నియమించవలెననే ఆలోచనను విరమించి రివిన్యూబోర్డు రద్దు చేసి దానిని రివిన్యూ శాఖలో కలిపివేయాలి.

ఆ యా శాఖల కార్యదర్శులనే ఆ యా శాఖోన్నతోద్యోగలనుగ కూడాచేసి, లేదా ఆ యా శాఖాధికారుల ( డైరెక్టరుల ) ను వుంచి కార్య దర్శులను ఎత్తివేసికొని జిల్లాలోని ఉన్నత ప్రజాస్వామిక సంస్థ యగు జిల్లా పరిషత్తులకు కమీషనరులకు యివ్వదలచిన అధికారాలు యిచ్చి, నడుమ అంతస్థులను ఎత్తివేసి విస్తృత వికేంద్రీకృత ప్రజాస్వామ్యాన్ని నడుపుటకు పునాదులు వేయడమే నేటి ప్రజా స్వామిక కర్తవ్యం. ( 10–9–59 ).

# ప్రజాస్వామిక వికేంద్రీకరణం

"స్థానిక స్వపరిపాలనయే, విధిగా నిజమగు ప్రజాస్వామ్యానికి పునాదికావాలె. మనం మరింత క్రింది అంతస్థులోని ప్రజాస్వామ్యాన్ని గురించికాక పై అంతస్తులోని ప్రజాస్వామ్యాన్ని గురించి ఆలోచించడం లోనే అలవాటుపడిపోయాం. క్రింది అంతస్థులలోనుంచి నిర్మించక పోతే పై అంతస్థులో ప్రజాస్వామ్యం జయప్రదం కాజాలదు" అన్నారు ఇండియా ప్రధాని పండిత జవహర్‌లాల్ నెహ్రూ. (Report of the Local Finance Enquiry Committee, 1948 P 1) పంచవర్ష ప్రణాళికా ప్రారంభంలో గ్రామీణ ప్రాంతాలల్లో సమాజికాభివృద్ధి బ్లాకులు ఏర్పరిచి ప్రభుత్వ స్థాయిలో పని ప్రారంభం అయినది. గాంధీజీ నిర్మాణ కార్యక్రమంతో 1920 లో ప్రారంభమై 1925లో శ్రీకలిదిండి గంగరాజుగారి అధ్యక్షతను తాడేపల్లిగూడెంలో తాలూకా బోర్డుతరపున శ్రీ శనివారపు సుబ్బారావు నిర్వహించిన గ్రామ పునర్నిర్మాణ తరగతులు, శ్రీ నరసింహదేవర సత్యనారాయణ అలమూరు గ్రామోద్ధరణకార్యక్రమం ప్రభుత్వ అనుమాన చ్ఛాయల క్రింద ప్రజలచే నిర్వహింపబడి, చివరకు ఆంధ్రకేసరి ప్రకాశం గారి మంత్రిత్వంలో మద్రాసు రాష్ట్రంలో ఫిర్కా కార్యక్రమంగా ప్రభుత్వ స్థాయి అందుకుంది.

ప్రథమపంచవర్షప్రణాళికలోని కమ్యూనిటీ ప్రాజెక్టుల, జాతీయవిస్తరణ కేంద్రాలుగా సాగుతున్న కార్యక్రమానికి ప్రజల సహకారం అత్యవసరం అయింది. అందుకు ఏర్పడిన సలహా సంఘాలు, వాటి అనుభవాలవల్ల

ప్రభుత్వం వైపునుండి, ఇటు స్వరాజ్యం—ప్రజాస్వామిక రాజకీయ వ్యవస్థ క్రింది అంతస్థులలోని అధికారవిధానం (బ్యూరోక్రసి) యెడ ప్రజలలో కలిగిన విముఖత్వంవల్ల క్రింది అంతస్థులో కూడా ప్రజాస్వామికసంస్థ లేకపోవడంవల్ల కలిగిన అందోళన ప్రజలవైపునుండి వికేంద్రీకృత ప్రజాస్వామ్య వ్యవస్థ అవసరం ప్రస్ఫుటం అయింది. ప్రభుత్వం సమాజాభివృద్ధికి కావలసిన జన సహచర్యం—వాటి సంఘాల నిర్వహణ వల్ల ఏర్పడుతున్న సమస్యల పరిష్కారానికై ప్లానింగు కమిషన్ శ్రీ బలవంతరాయి మెహతా జట్టును నియమించింది. వారి ప్రజాస్వామిక వికేంద్రీకరణ సూచననే ఈనాటి ఆంధ్రప్రదేశ్ పంచాయతీ సమితుల, జిల్లా పరిషత్తుల రూపం దాల్చినవి.

మెహతాజట్టు జిల్లా సంస్థలను ప్రస్తావిస్తూ. "అట్టి సంస్థ ఏర్పరుస్తే, అది శాసనబద్ధమైనది, ఎన్నుకోబడినది దాని అధికారాలు సమగ్రమైనది బాధ్యతలుకలిగింది, నిర్వహణకు తగినసాధన సామగ్రి కలిగినది, సమృద్ధమగు ఆధారాలు కూడా కలిగినదిగా వుండాలె" అన్నారు.

అంతేకాదు. "ప్రభుత్వంచేత గాని. ప్రభుత్వ అనుబంధ సంస్థల చెప్పుచేతలవల్లగాని నొక్కి వేయబడకూడదు, అది తప్పులు చేయటానికి, ఆ తప్పులనుండి పాఠాలు నేర్చుకోవడానికికూడా అవకాశం కలిగి వుండాలి. అయితే తప్పులు జరుగ కుండుటకు అవసరమగు సలహాలు సంప్రదింపులు పొందాలె. ఇవి చివర చివరకు స్థానికాభివృద్ధిలో ప్రజల అభిమతాన్ని వెలిబుచ్చే సాధనగా తయారై పోవాలె" ననికూడా అన్నారు. (Report of the Team on National Extension Service and Community Development Blocks Vol. I. Page VI)

ఆంధ్ర జిల్లాలలో జిల్లా పరిపాలనలో కొంత భాగం ప్రజలచే ఎన్నుకోబడిన జిల్లాబోర్డుల పరమైవున్నా. భారత రాజ్యాంగంద్వారా అమలుకు వచ్చిన శాసనసభలలో మంత్రివర్గాలు ఏర్పడిన 1952 తర్వాత ఇవిరిద్దయి ప్రత్యేకాధికారుల నిరంకుశపాలన క్రింద రాష్ట్రప్రభుత్వంపరం అయిపోయినవి. హైద్రరాబాదు రాష్ట్రంలో 1954 లో జిల్లాబోర్డులు ఏర్పడినవి. అధికారులు అధ్యక్షులు, వీటికి ప్రభుత్వం నియమించిన అధికారులు అనధికారులు సభ్యులు. ఆర్థిక వనరులుతక్కువ, ఎన్నికలుఅసలే లేవు. రాష్ట్రాలలోను కేంద్రాలలోను వున్నది ప్రజాస్వామిక ప్రభుత్వాలే కావున జిల్లాబోర్డులు అనవసరం అన్నారు. వయోజన ఓటింగు ప్రమాదం తెల్పింది కావున ఎన్నికలు అనవసరం అన్నారు. పరోక్షపు ఎన్నికల ప్రాతిపదికపై పంచాయతీల ద్వారా పునర్నిర్మిస్తాం అన్నారు. కాదు—శాసనసభ్యులనే సభ్యులుగా చేస్తాం అన్నారు. చివరకు జిల్లా బోర్డుల ఉనికికి కాలదోషం పట్టిందన్నారు. తాలూకా బోర్డులు మరీ చిన్నవన్నారు.

ఈ వాతావరణంలో మెహతాజట్టు సూచించిన పంచాయతీ సమితులు, జిల్లా పరిషత్తులు, వీటితో మరల క్రింది అంతస్థులో ప్రజాస్వామిక సంస్థలు వుండవలెననే యోచన వచ్చినది. వికేంద్రీకృత ప్రజాస్వామ్యం కావలెనంటూ పరోక్షపు ఎన్నికలు, అధికారులతో నింపవలెనని మెహతా జట్టు సూచించింది. రెంటికి ప్రథమంలో అధికారులే అధ్యక్షులు అన్నారు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం తమ శ్వేతపత్రంలో జిల్లా పరిషత్తులో అధికారులను సభ్యులను చేసింది. కాని బిల్లులో పరోక్షపు ఎన్ని

కలు, పంచాయతీ సమితికి అనధికారి అధ్యక్షుడుగా సూచిస్తూ జిల్లా పరిషత్తులో అధికారులను సభ్యులనుండి తొలగించింది. చివరకు సెలక్టు కమిటీలో జిల్లా పరిషత్తుకు అనధికారిని అధ్యక్షుణ్ణిగా అంగీకరించడం జరిగింది.

మెహతా జట్టు తమ నివేదిక రెండవ సంపుటిలో ఇతర దేశాలలోని స్థానిక సంస్థల నిర్మాణం ఇచ్చారు. స్వీడన్‌లో దామాషా పద్ధతిని ఎన్నికలు జరుగుతవని, ఇంగ్లాండు, అమెరికాలలోను ఎన్నికలేనని, యుగోస్లావియాలోని ప్రజా సమితులకు వయోజన ఓటర్లు రహస్య ఓటింగు ద్వారా ఎన్నుకుంటారని వివరించారు.

నేటి పంచాయతీ సమితులకు, జిల్లా పరిషత్తులకు వయోజనులచే సరాసరి ఎన్నుకోబడే పద్ధతి వుండాలి. అట్లై జిల్లా పరిషత్తు అధ్యక్షుని ఎన్నికను జిల్లా వ్యాపితంగా వయోజనులచే సరాసరి ఎన్నుకొనే పద్ధతి ఏర్పాటు చేయాలె. స్థాయి సంఘాల సభ్యుల ఎన్నిక దామాషా ఓటింగు పద్ధతిని జరిపించాలె.

మెహతా జట్టు అధికారాలు విధులు సమగ్రంగా వుండవలెనన్నారు, ఇప్పుడు ఏర్పడిన పంచాయతీ సమితులకు మాత్రం బాధ్యతలు అంటూ జాబితా ఒకటి అనుబంధంగా చేర్చారు. కాని జిల్లా పరిషత్తుల అధికారాలు విధులు అంత సమగ్రంగా నిర్దేశింపలేదు.

భూమి శిస్తులో అబ్కారీమున్నగువానిలో గ్రామ పంచాయతీలకు, పంచాయతి సమితులకు, జిల్లా పరిషత్తులకు, ఎవరెవరి కెంత శాతమో శాసనంలోనే నిర్ణయించిస్థిరమగు ఆదారాలు చూపాలె.

స్థానిక సంస్థల పరిశీలన సంఘం 1948లో "రాష్ట్ర ప్రభుత్వాలకు, స్థానిక సంస్థలకు ఎవరి కెవరి కే యే అధికారాలు కేటాయించ వలెననే విషయంలో ఏసిద్ధాంతం అవలంభించినా, స్థానిక సంస్థల విచార కరమగు ద్రవ్యస్థితి ఈ సంస్థలను నిర్వీర్యంచేసే విధంగా వుండకూడ దన్నారు (పుట 51). జాన్‌మత్తాయి అధ్యక్షులుగాయేర్పడిన పన్నులువిచా రణ సంఘం (1954) స్థానికసంస్థల ద్రవ్యాధారాలు కేంద్రానికి రాష్ట్రాలకు ఆధారాలు అధికారాలు నిర్దేశించుతూ పార్టు ఎ పార్టు బి గా షెడ్యూలు రాజ్యాంగరీత్యా యేర్పరచినట్లే, రాజ్యాంగ రీత్యానే స్థానిక సంస్థలకు పన్నులు నిర్దేశించవలెనని" సూచించారు. (పుట 325)

భారతదేశం మొత్తాన ఈ అవకాశం రాజ్యాంగం ద్వారా కలిగించాలి. అది జరిగేవరకు కనీసం శాసన బద్ధంగా గ్రామపంచాయతీ సమితులకు, జిలపరిషత్తులకు, గ్రామ పంచాయతులకు గల అధికారాలు, ఆధారాలు రాష్ట్ర ప్రభుత్వం శాసనంద్వారా నిర్దేశించాలి.

జిల్లా బోర్డులు రద్దు చేయబడినవని, జిల్లా బోర్డులకు చెందివున్న అధికారాలు, బాధ్యతలు అటు జిల్లా పరిషత్తులకు, ఇటు పంచాయితీ సమితులకు సంక్రమింపజేయ బడినవని, వాటిని ప్రభుత్వమే ఎప్పటికప్పుడు ప్రకటనద్వారా ప్రకటించుతు ఇది ఎవరెవరికి ఏ ఏ అధి కారాలు ఇవ్వబడినవో నిర్దేశించలేదు. మెహతా జట్టువారే ఇచ్చే అధికా రాలు (Devolve)నిర్దేశించవలసిందే గాని, అప్పటికప్పుడు ప్రకటనద్వారా ఇచ్చేపద్ధతి (delegation) పనికిరాదన్నారు.

ప్రథమంగా జిల్లాపరిషత్తుల బాధ్యతలు అధికారాలు నిర్దేశించాలి. ఎప్పటికప్పుడు అధికారాలేవో ప్రకటించే అధికారం తమ చేతులలో

వుంచుకోవటం వికేంద్రీకరణం (Decentralisation) కాజాలదని మెహతా జట్టే ఈ విధంగా స్పష్టంచేశారు.

"2 8 It is not infrequently that delegation of power is mistaken for decentralisation. The former does not divest the Government of the ultimate responsibility for the actions of the authorty to whom power is delegated; this authorty is under the control of the Governemnt and is in every way subordinate to it. Decentralisation on the other hand is a process whereby the Government divests itself completely of certain duties and responsibilities and develops them on to some other authortity. It is true that evolution of responsibility cannot be complete without a complete devolution of all the control over the necessary resources and admittedly such devolution cannot be completely feasible in any country. What we can work up to is to decentralise certain sources of income assured under statute and recommend that further recources should be made available by actual agreement between the govetnment and the local body. Delegation of powers is taking place to progtessively lower levels of executive machinery. Decentralisation of responsibility and power on the other hand has not taken place below the State level in recent years. Such decentralisation has now become urgent and can be effected by a devolution of powers to a body which when created will have the entire charge of all development works within its jurisdiction. The term 'development work' covers agriculture, animal husbandry, co-operation, minor irrigation works, village industries, primary education, local communications, sanitation, health and medical relief, local amenities and similar subjects. If this body is to function with any vigour, initiative and success, the Government will have to devolve upon it all of its own functions in these fields within the body's jurisdiction, reserving to

itself the functions of guidance, supervision and higher planning and where neccssary, providing extra finance."

ప్రథమ పంచవర్ష ప్రణాళిక, (పుట 128) రెండవ పంచవర్ష ప్రణాళిక (పుట 148)లోనూ ప్లానింగు నిర్వహణలో జిల్లాప్రధాన స్థాయిగా గుర్తింప బడింది. 'పరిపాలనలో జిల్లాస్థాయి కీలకపాత్ర వహిస్తున్నదని; ప్లానింగు అనేక స్థాయిలలో జరుగనున్నందున ఉన్నత స్థాయిలో ప్లానింగులో పాల్గొంటున్న శాసన సభ్యులు, పార్లమెంటు సభ్యులు కూడా జిల్లా స్థాయిలో కూడా పాల్గొనవలసి వున్నది. జిల్లా కీలకస్థానమని గుర్తించిన ప్రభుత్వ జిల్లా సంస్థకు చెందునన్న అధికారాలేవో నిర్దేశించకపోవడం వికేంద్రీకరణ కాజాలదు. అందుచేయిప్పటికైనా శాసన బద్ధంగా అధికార వికేంద్రీకరణ జరగాలి.

1937లో మధ్యరాష్ట్రాల కాంగ్రెసు మంత్రివర్గంలోని స్థానిక స్వపరి పాలనా మంత్రిగావున్న పండిత డి. పి. మిశ్ర అపుడొక ప్రతిపాదన చేశారు దానిలో జిల్లాబోర్డుల పరిధిపెంచి, జిల్లా పాలన కంతటికి వర్తింపజేస్తూ, జిల్లాకలెక్టరును జిల్లాబోర్డుకు ప్రధాన నిర్వహణాధికారిగ వుంచవలెనని, జిల్లాలోని వివిధ శాఖలు అధికారులు దాని సిబ్బంది భాగంగా వుంటారని. జిల్లా పరిపాలనలోని అన్ని శాఖలపైన ఈ బోర్డు అధికారం (control) కలిగివుంటుందని, దీనివల్లజిల్లాబోర్డుకు నిర్వహణాధి కారులు వుండడం. జిల్లా పరిపాలనలోని అధికార తత్వం తగ్గడం, ప్రజల దృష్టిలో స్వపరిపాలనకు ప్రాధాన్యత యేర్పడడం, ప్రజలకు శ్రద్ధాశక్తులు కలగడంజరుగుతుందన్నారు, (Local Self Government In India by M. P. Sarma P. 30) అంతేకాదు. వింధ్యప్రదేశ్ గవర్నరుగా వుండి తర్వాత రెండవ ఫైనాన్సు కమిషనుకు అధ్యక్షులుగాకూడా వుండిన

నేడు రాజ్యసభ్యులుగావున్న శ్రీ కె. సంతానం సభాప్లానింగుసామాజికాభివృద్ధికి సంబంధించి ఇప్పుడు నిర్మాణమవుతున్న జిల్లాసంఘాలకు జిల్లాకలెక్టరును అధ్యక్షుడుగా వుంచవలెనని ప్రయత్నించడం పొరపాటని, అతనిని కార్యదర్శిగా వుంచితే పని సాఫీగా సాగుతుందని వ్రాశారు. (Planning and Plain Thinking 1958 by Sri K. Santhanam P. 104)

ప్లానింగు జయప్రదంగా అమలు జరుప వలెనంటే అటు అధికారులు, ఇటు అనధికారులు కలసి పనిచేయవలసి వుంది. అధికారుల చేత పనిచేయించగల సమీకరణాధికారిగా జిల్లా కలెక్టరు జిల్లా పరిషత్తులో వుండడం అవసరమే అయితే జిల్లా కలెక్టరును అధ్యక్షుడుగనో, ఉపాధ్యక్షుడుగనో, లేక స్థాయీ సంఘాల అధ్యక్షుడుగనో వుంచవలెననే ప్రభుత్వ దృక్పథం సరికాదు. జిల్లాకలెక్టరును జిల్లా పరిషత్తుకు కార్యదర్శిగా చేస్తే ఈ సమీకరణకు ఎంతో సహాకరిస్తుంది.

ప్రథమ పంచవర్ష ప్రణాళిక (పుట 139) నిర్దేశించినట్లు "మన రాజ్యాంగం కేంద్రంలోనూ, రాష్ట్రాలలోనూ, ప్రజా ప్రాతినిధ్య సంస్థలను యేర్పరచింది, పరిపాలనా నిర్మాణంలోని భాగంగా స్థానిక పరిపాలనా సంస్థలు కూడా వుండకపోతే ప్రజా స్వామ్య ప్రభుత్వ నిర్మాణం అసమగ్రంగానే వుండిపోతుంది."

అట్లే జిల్లా పరిషత్తుల ఆదాయ వ్యయంకూడా సంవత్సరానికి రూ. 13,22,000 లు వుండవచ్చు. ప్రతి సంవత్సరం ప్రతి పంచాయతి సమితికి దాదాపు మొదటిదశ బ్లాకులకు రూ. 3,52,000 లు, రెండవదశ బ్లాకులకు రూ. 2,45,000లు ఆదాయం వుంటుందన్నారు.

రాష్ట్ర పన్నులలోను, కేంద్రం నుండివచ్చే విరాళాలలోను ఎవరెవరికి వాటిస్తాయి, అవసరాలు, జనాభా గమనించి, నిర్దేశించుటకై మూడు

సంవత్సరాల కొక పర్యాయం ఆర్థిక సహాయ కమిటి నొక దానిని యేర్పరచాలె.

ఇంతకు ముందున్న జిల్లాబోర్డుల ఆదాయ వ్యయాలు (1-6-1956 నుండి 31-5-1959) ఈ విధంగా ఉన్నవి.

| జిల్లా | | అదాయం | వ్యయం |
|---|---|---|---|
| శ్రీకాకుళం | రు. | 38,33,995 | 37,89,347 |
| విశాఖపట్నం | .... | 14,41,048 | 27,70,746 |
| తూర్పు గోదావరి | .... | 32,06,808 | 29,14,597 |
| పశ్చిమ గోదావరి | .... | 62,90,756 | 63,97,806 |
| కృష్ణా | .... | 57,10,091 | 52,02,976 |
| గుంటూరు | .... | 69,04,040 | 63,33,817 |
| నెల్లూరు | .... | 56,76,451 | 54,67,028 |
| చిత్తూరు | .... | 36,40,885 | 35,52,940 |
| కడప | .... | 32,81,892 | 35,00,979 |
| అనంతపురం | .... | 26,48,596 | 27,50,586 |
| కర్నూలు | .... | 40,20,505 | 42,83,464 |
| మెదక్ | .... | 2,74,989 | 2,55,103 |
| నిజామాబాద్ | .... | 6,66,418 | 2,67,467 |
| కరీంనగర్ | .... | 7,84,654 | 2,90,702 |
| ఖమ్మంమెట్టు | .... | 3,28,542 | 1,32,683 |
| హైదరాబాదు | .... | 2,74,019 | 2,36,094 |
| నల్లగొండ | .... | 5,31,195 | 1,84,124 |
| అదిలాబాద్ | .... | 3,40,895 | 1,84,761 |
| మహబూబ్‌నగర్ | .... | 5,33,401 | 1,95,942 |
| వరంగల్లు | .... | 5,35,689 | 2,78,638 |

జిల్లా పరిషత్తులు, పంచాయతీ సమితి కార్యాకలాపాలలో భూసంస్కరణలు కూడా చేర్చాలె. అప్లై వీటికి నిర్దేశించిన కార్యకలాపాలల్లో కార్మిక సమస్యను కలుపాలె. మద్రాసు ప్రభుత్వం తమ స్థాయీ సంఘానికీ నిర్దేశించింది. పారిశ్రామిక కార్మికుల సమస్యలకన్నా ఆంధ్రప్రదేశ్ జిల్లాలలో వ్యవసాయ కార్మికుల సమస్యలు ఎప్పటి కప్పుడు ఉత్పన్నమై అధికాహారోత్పత్తికి విఘాతం కలిగిస్తున్నవి కావున వ్యవసాయాభివృద్ధికి, గ్రామీణ జీవితంలో ఆ వర్గం ఒక ప్రధానభాగం కావున జిల్లా పరిషత్తుల కార్యకలాపాలల్లో ఈ రంగాలు చేర్చాలె.

పంచాయతి సమితులు, జిల్లా పరిషత్తులు అమలు జరుపు పనుల లోనూ, ముఖ్యంగా వెనుక బడినవారి గృహవసతి, శ్మశానాలకు సంబంధించినంతవరకైనా భూములుతీసుకొనే అధికారం కూడా వీటికే యివ్వాలె.

పంచాయతి సమితులలో శాసన సభ్యులకుసభ్యత్వంలేకుండా చేసినా పరవాలేదేమోకాని సభ్యత్వంవుంటే వోటు వుండాలె. అధ్యక్షులుగాగాని, ఉపాధ్యక్షులుగాగాని పోటీ చేస్తారేమోననే భయ సందేహాలు వుంటే అది నిషేధించవచ్చు.

పంచాయితీ సమితిలో కలెక్టరువలెకాక, జిల్లాపరిషత్తులో జిల్లా కలెక్టరు సభ్యుడుగా వున్న మాట నిజమే అయినా, సభ్యుల కందరకు ఓటు నిచ్చుకొనే హక్కు వున్నట్లే జిల్లా కలెక్టరుకును, ఓటు నిచ్చుకొనే హక్కు ఉన్నమాటనిజమే అయినా జిల్లా పరిషత్తులో అధ్యక్షునిపై తేబడిన విశ్వాసరాహిత్య తీర్మానం చర్చకు వచ్చినప్పుడు జిల్లా కలెక్టరు జిల్లాపరిషత్తు సామాన్య సభ్యుడుగాగాక, విశ్వాసరాహిత్య తీర్మానంలో అభిమాన దురభిమానాలు లేక యే పైపు మొగ్గక పరిషత్తు సభ్యుల మనో

భావాల కతీతుడుగా వుంటుటకనువుగా జిల్లా కలెక్టరు విశ్వాసరాహిత్య తీర్మానం నిర్ణయంలో ఓటు కలిగి వుండకూడదు.

ఆంధ్రప్రదేశ వ్యాపితంగా జిల్లాలన్నింటిలోను బ్లాకు ఏరియాలు నిర్ణయంచేయబడివున్నందున కేంద్రప్రభుత్వంనుండిసమాజాభివృద్ధివిరాళం లభించకపోయినా, ప్రజాస్వామిక విధానమన్నా బడయగల విధంగా అన్నిబ్లాకులను ఒకేసారి పంచాయితీ సమితులను ఏర్పాటు చేయడం అవసరం. ఈ బ్లాకుపేరు ' సీమలు ' గా వ్యవహరిస్తే బాగుటుంది.